# A TRIENNIAL CATALOGUE OF MANUSCRIPTS

COLLECTED DURING THE TRIENNIUM
1922–23 TO 1924–25 AND
1925–26 TO 1927–28

FOR THE

## GOVERNMENT ORIENTAL MANUSCRIPTS LIBRARY MADRAS

BY

BHĀRATAKALĀNIDHI VIDYĀSĀGARA VIDYĀVĀCASPATI
P P SUBRAHMANYA SASTRI, B A (Oxon), M A (Madras)
*Ex Curator, Government Oriental Manuscripts Library and*
*Professor of Sanskrit and Comparative Philology,*
*Presidency College, Madras,*

AND

A SANKARAN, M A, PH D,
*Curator, Government Oriental Manuscripts*
*Library (Madras) at Tirupati*

*(Prepared under the orders of the Government of Madras)*

**VOLUME V—Telugu**
**(R. Nos 716 to 812)**

PRINTED BY THE SUPERINTENDENT
GOVERNMENT PRESS
MADRAS
1942

# INTRODUCTION

The third part of the fifth volume of the Triennial Catalogue of Manuscripts is prepared on the same plan as that of part three of volume four The numbering of the Manuscripts and the pagination of this part are in continuation of the similar part of the fourth volume Attention is drawn to a few important works noticed in this Catalogue —

1 Śankaravijayamu (R No 721) This is a rendering of the Sanskrit work attributed to Ānandagiri, said to be a disciple of Śrī Śankarācārya The author of this work is Ālūri Kuppana Kavi, a disciple of the famous Kastūri Ranga Kavi (about A D 1790), and he had the title of Āndhra Kālidāsa

2 Rāmagītalu (R No 726) This is a Telugu translation of the Sanskrit work of the same name, which is a treatise, philosophical in character The author of this book, Śivarāmakavi, son of Vīrarāghavakavi of Nellore, is the author of the famous book Kāmakalānidhi also (about 1715 A D )

3 Dvipadabhāgavatamu (R No 765) This contains up to the story relating to King Prthu in the fourth Skandha The author Tēkumalla Rangaśāyikavi is also the author of the four works, viz , Vīrarāghavaśataka, Krsnadandaka, Jānakīparinaya and Vānīvilāsavanamālika He mentions in his introduction the help given to him by Puspagiri Timmakavi of about 1790 A D

4 Krsnārjunīyamu (R No 775), by Mikkili Mallikārjunakavi, is a rendering into Telugu poetry of the Sanskrit "Bhagavadgītā" He was encouraged to undertake this work by Pāpayamantri of Lingamaparti The author also wrote Rāmacandrōpākhyāna at the instance of Udutala Pāpayamantri, about 1855 A D

5 Rudrakavivisayamu (R No 764) Contains several poems written by Rudrakavi of Kandukūru and also some of the 'samasyas' completed by him This book refers to several incidents relating to the biography of the author The manuscript under notice was transcribed from a ms acquired from Mr Rudrācāryulu, a descendant of Rudrakavi

6 Saptatālapradīpikā (R No 810) Some of the principles of the art and science of music and dance are herein described The name of the author is not known

As in the case of similar previous volumes of this Catalogue this volume is also furnished with a Subject Index, an Author Index and a General Index

P P SUBRAHMANYA SASTRI,
*Curator, Government Oriental Manuscripts Library*

MADRAS,
30*th March* 1941

## SYNOPSIS OF SUBJECT HEADINGS

NOTE —Reference is given to pages of the Subject Index

# SUBJECT INDEX
## OF THE
## WORKS DESCRIBED IN THE TELUGU PART OF THE TRIENNIAL CATALOGUE OF MANUSCRIPTS

[NOTE —The letters in column 2 are used in the following significance L means that there were no copies of the work in the Library P means that the manuscripts contain a portion which was not in the Library, T denotes that there were not more than three copies in the Library ]

| Name of the work | R Number |
|---|---|
| *Prosody* | |
| Ānandarangarātchandamu | T 785 (*a*) |
| Chandōviṣayamu | P 796 |
| Lakṣanarājīyamu | L 766 |
| *Lexicography* | |
| Āndhrabhāsāratnākaramu | 785 (*b*) |
| *Romance* | |
| Bhallānadaṇḍakamu | 795 (*a*) |
| Brahmōttarakhaṇdamu | T 745 (*a*) |
| Ganēśacaritramu | L 740 |
| Haravilāsamu | L 736 |
| Hariścandrōpākhyanamu | T 812 (*b*) |
| Kirātārjunīyamu | T 808 |
| Krṣṇārjunasamvādamu | L 730 |
| Krsṇavilāsamu | L 743 |
| Kucēlōpākhyānamu | 739, 811 (*b*) |
| Laksminārāyaṇavilāsamu | L 762 |
| Nalacaritramu (Dvipadakāvyamu) | 750, 769, 806 |
| Nirvacanōttararāmāyanamu | 771 (*a*) |
| Ranganātharāmāyaṇamu | 777 |
| Rukmangada caritra | 770 (*b*), 812 (*a*) |
| Rukmiṇipariṇayamu | L 791 |
| Saugandhikāpaharaṇamu | L 728 |
| Sitāvijayamu | 742 |
| Suratāṇipariṇayamu | L 729 |
| Uṣāpariṇayamu | 753 (*a*) |
| Uttaragōpurakatha pattu | L 774 (*a*) |
| Vaijayantīvilasamu | 811 (*a*) |
| Vasucaritravyākhya (Vidvajjanarañjani) | 798 |
| Virabhadravijayamu | 792 |
| Yayāti caritramu | 753 (*c*) 803 |
| *Itihāsa and Purāna* | |
| Bālabhāgavatamu | 723 |
| Dēvibhāgavatamu | L 716, 754 |
| Dvipadabhāgavatamu | L 765 |
| Dvipadabhāratamu | L 741 |
| Dvipadadaśama skandhamu | L 784 |

# AUTHOR INDEX
# OF THE
# TELUGU PART OF THE TRIENNIAL CATALOGUE
# OF MANUSCRIPTS

# GENERAL INDEX
## OF THE
## TELUGU PART OF THE TRIENNIAL CATALOGUE
## OF MANUSCRIPTS—VOL V

NOTE — The names in Italics are those of the works described in this volume

# A TRIENNIAL CATALOGUE OF MANUSCRIPTS.

## 1922-1923 to 1924-1925.

## Volume V.

### PART 3—TELUGU

### R No 716.

**Paper** 13½ × 8 inches Foll 222 Lines, 24 in a page Mode of writing, good Free from mistakes but breaks off in many places Injured

Presented in 1924-25 by Raja of Venkatagiri, Nellore district

దేవీభాగవతము

DĒVĪBHĀGAVATAMU

A rendering in Telugu of the Sanskrit work of the same name, dealing with the greatness of Dēvī or Śakti by Papayārādhya of Vēmanārādhya family

Contains the third Skandha complete

As the manuscript under notice contains only a portion of the main work, it is not possible to find out any other particulars such as the genealogy of the author, etc

**Beginning**

క శ్రీమ త్కీమహీఖ్యాత
స్థేమవిహారాభిరామ చేతనచేతస్
స్తోమరసభృంగ నిర్జిత
కామగుణాంగ ! భక్తకలుషవిభంగా !

వ. దేవా ! సకలపురాణేతిహాసకథాసుధాస్వాదననిష్ఠాంద్రులగు సన్మునిచంద్రులకుఁ దన్మనోరథరథచోదనాసూతుండగు సూతుం డిట్లనియె.

**End**

క. దేవీభాగవతసత్క-
థావల్లిని దృతీయ మచ్చమాంబాజగ్గ
క్ష్మావరుల కభీష్టార్థ
శ్రీ వెలయఁగ జేసి సుప్రసిద్ధిం జెందున్.

**Colophon**

ఇది శ్రీమత్పరమశివాద్వైతభావనాసారస్వతవిద్యాసాన్నిధ్య . . . . . . . . పాపయారాధ్యప్రణీతమైన దేవీభాగవతమను మహాపురాణమందుఁ దృతీయాశ్వాసము

(వి-వి)—

తృతీయస్కంధము సమగ్రముగాఁ గలదు వ్రాఁత మంచిది తప్పులు లేవు. శైథిల్యముగలదు గ్రంధపాతము లల్పముగాఁ గలవు

ఇది ములుగు పాపయారాధ్యులు రచియించిన తెలుఁగు దేవీభాగవతమున భాగము ఈయనకే వేమనారాధ్యుల సంగమేశ్వరారాధ్యులని నామాంతరము ఇది గ్రంధములోని యొకభాగ మగుటచే ఇతర విశేషము లెఱుఁగరాదు

---

## R No 717.

Paper 8⅞ × 7 inches Foll 24 Lines, 20 in a page Mode of writing, good Free from mistakes Good

Presented in 1924–25 by Raja of Venkatagiri, Nellore district

తిరునాళ్లదండకము

TIRUNĀLLADANDAKAMU

A work in the Dandaka metre describing the procedure of car festival of god Kāśīviśvanātha worshipped in the town of Venkatagiri The work under notice imitates the work called Bhōginīdandaka

Complete

**Beginning**

శ్రీమించు వెల్గోటివంశాబ్ధిరాకాశశాంకుండు దృప్తారిరాజన్యమత్తేభ కంఠీరవేంద్రుండు జంభారియోషిన్మణీచారుతాంబూలపేటీకృశానుద్వితీయోరువక్షోజయుగ్మాంతరాంతఃపుర శ్రీనిటాలస్థలక్రవ్యభుకామినీవక్త్రపంకేజకంధీశకాంతామణీకర్ణవాతాంగనాభూరిధమ్మిల్లయక్షేశపత్నీకరాగ్రాంథకారాతియోషాకటీదేశకర్పూరఖండస్ఫురత్

*　　*　　*　　*

బంగారుయాచక్షమానాథసత్పుత్రకుండాకుమారాంకయాచక్షితీంద్రుండు శ్రీకాశికానాథవిశ్వేశ్వరస్వామికిన్ రంగుమీఱంగవర్షోత్సవంబొప్పఁ జేయింప నుద్యుక్తుఁడై బంధురాజన్యులన్ మిత్రవర్గంబులన్ దేశసంవాసులన్.

**End :**

ద్విజశ్రేష్ఠులున్ శ్రీతి దీవింపఁగా మన్నెకంఠీరవా రాయవేశ్యాభుజంగా మహాఖడ్గనారాయణాంకా భళీ గాయిగోవాళ శౌరీ జయస్తే జయస్తే జయస్తేయటంచున్ రహిన్మాగధశ్రేణి కైవారముల్ సేయఁగా సద్గుణాలంకృతుండై మహీమండలం బర్థిఁ బాలించె

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత మంచిది తప్పులు లేవు శైథిల్యము గ్రంథపాతములు లేవు

ఇది వెంకటగిరి సంస్థానప్రభువుసు వెలుగోటి బంగారు యాచమనేని పుత్త్రుడును నగు కుమారాంక యాచభూపాలుఁడు వెంకటగిరిరాజధానిలో వేంచేసియున్న కాశీ విశ్వనాథస్వామివారి తిరునాళ్లను జరపించునప్పటి వైభవమును వర్ణించుచు నెవరో రచియించిన దండకము. ఇది భోగినీదండకము ననుకరించును

---

## R No 718

**Paper** 10¾ × 9¾ inches Foll 12 Lines, 20 in a page **Mode of** writing, bad Contains mistakes and omissions Good

Transcribed in 1924 25 from a MS of M R Ry Jaladanki Vēnkatēsvaramgāru, Jaladanki, Nellore district

Foll 11*b* and 12 are left blank

జ్ఞానప్రసూనాంబికాశతకము.

JÑĀNAPRASŪNĀMBIKĀŚATAKAMU

Same work as that described under R No 233(*d*) ante

Complete

(వి-వి )—

సమగ్రము వ్రాఁత యంత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు

ఇది ఆర్. నె 233 (d) లున వర్ణితమైన గ్రంథమే.

---

## R No 719

**Paper** 10¾ × 9¾ inches Foll. 36 Lines, 20 in a page **Mode of** writing, not good Contains mistakes and breaks off in many places Good

Foll 35 and 36 are left blank

Restored in 1924–25 from a MS of the Government Oriental MSS Library, Madras

తారకబ్రహ్మరాజీయము

TĀRAKABRAHMARĀJĪYAMU

Same work as that described under R No 347 ante
Incomplete

(తె-వి )—

అసమగ్రము మూడవ యాశ్వాసమును, నాల్గవ యాశ్వాసమున గొంతయుఁ గలదు వ్రాఁత మంచిదిగాదు తప్పులున్నవి శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు

ఇది ఆర్. నె 347 రున వర్ణితమైన గ్రంథమే

---

## R No 720

Paper 10¾ × 9¾ inches Foll 88 Lines, 20 in a page Mode of writing, not bad Contains mistakes and breaks off here and there Good

Restored in 1924–25 from a MS of the Government Oriental MSS Library, Madras

కాంభోజరాజుకథలు.

KĀMBHŌJARĀJUKATHALU

A series of stories in homely language relating to the King of Kāmbhōja The work is also called "Bhōjarājukathalu" The stories contained herein are full of morals

Complete

**Beginning**

క. శ్రీ నారీనయనచకో
రానందసుధాంశుబింబ హారిదశ్వసహ
స్రానత తేజోనిర్జర
సేనాసంసేవ్యమాన శ్రీ నరసింహా।

వ. అవధరింపుము.

క సూత్రకథ భోజరాజ చ
రిత్రం బానడుమభక్తనృప సీతుల్
చిత్రకథలయి తలిర్పఁగ
శ్రోత్రసుఖముగా నొనర్చఁ జొప్పడియుండున్

వ ఆ కథ యాలాగంటేను

క మహిత సముజ్జ్వల తేజుఁడు
విహితాచారైక రతుఁడు వీరవినోద
స్నేహుఁడు బహురాజ్యదక్షుఁడు
మహుఁడను కాంబోజరాజు మహిఁ గడునొప్పున్.

వ అటువంటి కాంబోజరాజు అతిభీకరమయిన పరాక్రమముకలిగి తన దేశమందు యథారాజా తథాప్రజా అనే న్యాయము తప్పకుండా నడువకట్టడిచేసి ప్రజల కలిమి కసూయుత లేక రాజ్యంచేస్తూఉండెను.

**End**

మరునాఁడు రాజున్ను రాజకుమారుడున్ను అర్చకుడున్ను కొలువు చావడిలోనికి వచ్చి కూర్చుండి ప్రధానిని పిల్వనంపగా కుమారుడు చని పోయినందుకు ప్రధాని రానని చెప్పి పంపగా కొలువుగాండ్ల నంపించి వానిని తెప్పించి యెంత నమ్మికయయినా ప్రధానియందు రాజ్యభారంచడమ రాజు నాశనమునకేయని వ్రాసిన వ్రాత యనుభవమాయెనని నీకు రాజ్యమిచ్చిన నన్నవలసిన పనియేకాని నిన్నన పనిలేదని యతని బహి ష్కారముచేయించి యతని యింటనున్న పదార్థమంతయు తెప్పించి బ్రాహ్మణుల కిప్పించి యతనిని గ్రామ బహిష్కృతునిగజేసి పురోహితుని బిలిపించి విరూపాక్షునికి సర్పగండము వచ్చినదని యీ బ్రాహ్మణుండు చెప్పిన నీవు గసరుకొంటివి గనుక రాజున కుపకారంబు సేయని నీవు దారపుత్రాదులతో వూరు వెడలిపొమ్మని యాజ్ఞయిచ్చి తన భార్యతో కోడలిని రప్పించి యామె దుర్నడతకు శిరశ్ఛేదము చేయించెను వారలతోడబుట్టినదానిని బిలిపించి యర్చకునకు గోష్ఠి బహుమాన మిప్పించి రాజున్ను తనకుమారుడున్ను సుఖముగా రాజ్యముసేయు చుండిరని సిద్ధుఁడు చెప్పెను గనుక భోజరాజున్ను ఈ వర్తమాన మంతయు విని సుఖముగా దాను ధర్మముతప్పక రాజ్యము చేయుచుం డెను సిద్ధుఁడు తిరిగి తపస్సునకు బోయెనని దత్తాత్రేయులు కథను చెప్పగా పితామహుండు సంతోషించినవాఁడాయెను.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత యొకమాదిరిగానున్నది. తప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాతము లకొకచోట గలవు

ఈ కథలకే "భోజరాజు కథ" లనియుఁబేరు అనంతామా త్యుని భోజరాజీయమందలి పద్యము లిందుఁ బెక్కులు గైకొనబడనవి.

R No **721.**

**Paper** 10¾ × 9⅛ inches Foll 224 Lines, 20 in a page Mode of writing, not good Full of mistakes and breaks off in many places Good

Restored in 1924–25 from a MS of the Government Oriental MSS Library, Madras

శంకరవిజయము (ఆచార్యవిజయము)

ŚANKARAVIJAYAMU (ĀCĀRYAVIJAYAMU)

A Telugu rendering of the Sanskrit work Sankaravijaya attributed to Ānandagiri, said to be a disciple of Śankaracarya It gives an account of the leading incidents in the life of Śankarācārya The author Kuppanakavi of Ālūr wrote this work at the instance of the leaders of the Niyōgi Brahmans living in Madras The King Tulajāmahārāja of Tanjore honoured the author with many rewards The author had the title "Āndhrakālidasa" and was the pupil of Kastūrirangakavi who was the author of Rangarātchandassu in Telugu

Complete in six Āsvāsas

**Beginning**

శా శ్రీలక్ష్మీజలజాక్షి యంకతలిపై౯ జెల్వొంది నిర్ద్వేల సు
శ్రీల౯ ముద్దులు గుల్క దైత్య

\+ * * *

సీ. భారతి కేకవిప్రవరునిజిహ్వ ని
త్యముగ వసించునాస్థానవాటి
వాణీవధూటి కెవ్వాని నున్నలుకులు
ధరియించునట్టిముత్యములజాలు
శారద కేసుధీస్వామిచేతోవీధి
యమరిసరత్నసింహాసనంబు
పలుకులవెలఁది కేభావజ్ఞునిగృహంబు
నెట్టుగా వసియించు పుట్టినిల్లు
నలువచెలియకు నెవ్వఁ డెన్నఁదగుపుత్త్రిఁ
డట్టికస్తూరిరంగార్య నచలధైర్యు
నార్యనుతచర్యు మద్గురువర్యు నెంచి
ప్రణుతి గావింతుఁ బలుమారు ప్రస్తుతింతు.

**End**

విదళితరిపువారా వేదసౌధప్రచారా

సదవనమతిసారా శాస్త్రతత్త్వార్థపూరా
సదయహృదయరూపా సర్వమంత్రస్వరూపా।

**Colophon**

ఇది శ్రీ లక్ష్మీనృసింహదేవదయాసంపాదితసరససాహిత్యవిరాజిత శ్రీమదాలూరి వెంకటగిరిసుధీపౌత్ర వెంకటేశ్వరార్యనరసమాంబికా సుపుత్ర ఆపస్తంబసూత్ర కాశ్యపగోత్రపవిత్ర కస్తూరిరంగసద్గురు పాదారవిందభజనానందితహృద్విలాస శ్రీమద్భోసలకులజమహారాజ కటాక్షసముల్లసితాంధ్రకాళిదాసప్రణీతంబైన ఆచార్యవిజయంబను మహాపురాణంబునందు మణికర్ణికాతీరంబున ధ్యానారూఢుండైయున్న గురునికి వ్యాసుండు వృద్ధబ్రాహ్మణరూపంబుతోఁ గానఁగనిపించుటయు వార లిరువురు భాష్యసూత్రార్థవిమర్శనప్రసంగంబు సేయుటయును, ఆ వృద్ధుండు వ్యర్థకరణంబుగాఁ బలికిన సహింపక గురుండతని కపోలతాడనంబు సేసి తఱుముటయును, పెండియు పద్మపాదుఁడవలన వృద్ధుని వ్యాసుండని యెఱిఁగి యాచార్యుండు ప్రార్థించ నతండతనికి నిజరూపంబుతోఁ బొడసూపుటయును జతుర్ముఖసందర్శనంబును, నతనియనుమతిఁ బడసి వ్యాసుండు గురునకు ఆయుఃప్రసాదంబొసంగుటయును దదనుమతంబున గురుం డుత్తరాభిముఖంబుగా నద్వైతమతస్థాపనార్థంబుగా వెడలుటయు,
శక్తిమతప్రచయంబును గాణాపత్యమతనిర్వహణంబును గాపాలిక మత సమ్మతంబును గులువారి ? విలాసంబును గురు మహానందైక్యప్రభావంబును, సచ్చారిత్రశ్రవణఫలప్రకారంబును నను కథలం బ్రథితంబై ఏక త్రింశత్ప్రకరణంబులుగలిగి వెలుంగునది సర్వంబును షష్ఠాశ్వాసము సంపూర్ణము.

(వి-వి)--

సమగ్రము వ్రాఁత మంచిదిగాదు. తప్పులు గ్రంథపాతములు మెండు. శైథిల్యము లేదు.

ఆనందగిరి సంస్కృతభాషలో రచించిన శంకరాచార్యవిజయమును బట్టి తెలుఁగున నా ఱాశ్వాసముల పద్యకావ్యముగా నాంధ్రకాళిదాస బిరుదాంకుఁడయిన యాలూరి కుప్పనకవి దీని రచియించెను. మదరాసులోనున్న నియోగి ప్రముఖు లీకవికిఁ బ్రేరకులు తంజాపురాధీశ్వరుఁడయిన తుళజామహారాజుచే నీకవి సమ్మానితుఁడయ్యెను. రంగరాట్ఛందస్సును రచియించిన కస్తూరిరంగ కవి యీ కవికి గురుఁడు [illegible] రచియించినాఁడు.

## R No 722.

Paper 10¾ × 9¾ inches Foll 500 Lines, 20 in a page Mode of writing, not good Contains mistakes but free from omissions Good

Transcribed in 1924-25 from a MS of M R Ry Andela Śankarayyagāru, Kandukur, Nellore district

శివరహస్యఖండము

### ŚIVARAHASYAKHANDAMU

Bound in three volumes Foll 1*a*—500*a* Fol 500*b* is left blank

A Telugu rendering of the Sanskrit work of the same name, forming a part of the Śankarasamhitā of the Skāndapurāna The author Vīrabhadrakavi of Vankāyalapādu was the son of Rāganāmātya who belonged to the Ārvēla Niyōgi family and of Kaundinyagōtra The author's maternal grandfather belonged to Mōcerla family The author was honoured by Mandapati Rāmacandraraja, a king of the solar race For other particulars regarding the genealogy of the author, etc, see the extracts given below

Contains the Kandas 1—6 complete

Date of transcription—The copying of the work was commenced on the 5th day of the bright fortnight of the lunar month Nija-Jyēstha and was completed on Wednesday, the 11th day of the dark fortnight of the lunar month Āsādha in the year Durmikhin Name of the scribe—Amarayya, son of Pāpayya of Andela, who copied from a MS belonging to Pidupaiti Kalyanayya

**Beginning**

శా. శ్రీకల్యాణగుణాస్పదం బయినయాశీతాద్రిసంజాత నా
లోకింపఁ ముఖ మబ్జతుల్య మగుటఁ లోలన్మిళిందాళినా
జోకఁ దన్ముఖమందుఁ బొల్చు శిఖ నిస్తుల్యంబులౌ తారకల్
మాకుం జేయు శుభంబు నెప్పుడును సమ్మానంబు గణ్యంబుగాఁ.

* * * *

గీ. సూర్యవంశజు లార్యసం స్తుత్యు లార్య
సమ్మతులు మందపాటి వంశప్రశస్తు
లమ్మహారాజులకు బహిఃప్రాశ్రితుఁడను
గాన వారలవంశప్రకార మెంతు.

సీ శ్రీరామచంద్రధాత్రీపతితనయులు
రామభద్రనృపాల రఘుపతీంద్రు
లందుఁ బిన్నకుమారుఁ డగురఘుపతిరాజ
వంశవర్ధను రామ భద్రనృపతిఁ
గనియె నాపుణ్యసం కల్పుఁడద్భుతగుణ
ములను శ్రీరాముల కొలఁదియనఁగ
దనరుసత్పుత్త్రి నుత్తమవర్ణునీరామ
చంద్రరాజును సుత సత్తములని
గాంచె నారామచంద్రభూకాంతుఁ డవనిఁ
బ్రోచుచును సత్యధర్మప్రబోధశౌర్య
పటిమలను సాటిశ్రీరామభద్రుఁ డనఁగఁ
బుత్త్రపౌత్త్రాభివృద్ధిఁ జేఁబొలుపుమీఱె

వ కూటస్థుండగు రామచంద్రరాజున కగ్రతనయుండగు రామభద్రరాజువంశకీర్తనం బొనరించెద

చ ధరణిని మందపాటి కులధన్యుఁ డనందగు రామచంద్ర భూ
వరునకు నగ్రపుత్త్రి డనవద్యగుణాన్వితుఁ డార్యపూజ్యుఁడై
పరగినరామభద్రనరపాలసుతుం డగురామచంద్ర రా
జురుతరకీర్తి మించఁగ సమున్నతి నర్యమవంశక ర్తయై

* * * *

క. ఆరామచంద్రభూపా
లారామఫలం బనంగ ననవద్యగుణో
దారుఁ డగురామభద్ర ధ
రారమణుఁడు దనరు శంకరప్రతిముఁ డనన్

* * * *

క. కాశ్యపగోత్రులు సజ్జన
వశ్యులు రణమండలస్థవైరిసమూహా
వశ్యాయచండభానులు
పశ్యత్ఫాలాంబకకృతసపర్యు ల్ధరణిన్.

క వారలు మన్ననసేయఁ గృ
పారతులగుమత్కులంబువారలు శివ పా
దారాధకులైయుందు ర
[illegible]

క కౌండిన్యగోత్రు లీశ్వర
మండితపదకమలభక్తిమహితులు భోగా
ఖండలసము లార్వేలజు
లొండెఱుఁగరు స్వామికార్య మొకటెటిదకటన్

ఉ ఆగుణరాశిదైనకులమందునఁ బుట్టిరి వార్ధిఁజంద్రుఁ డ
బ్జాగమమందు జీవనముభావమునన్ శివభక్తిలీల న
భ్యాగతదానశీలులు మహాపురుషుల్ జనకక్రమంబుగా
రాగనగుర్వయాఖ్యుఁడును రమ్యగుణుండగు శంభునాముఁడున్.

చ వనజవిరోధిచంద్రికయు వారిరసంబును భక్తినిశ్చలం
బును ఘనవృత్తికై వెలయు పోలిక వారికి ధర్మపత్నులై
యొనసిరి మత్కులంబు ధర నెన్నికకెక్కఁగఁబార్వతమ్మగా
రును ప్రెగడమ్మ వెంగమ నిరూఢిగఁదత్క్రమముల్లసిల్లఁగాన్.

సీ గీ దివిజ నరపూజ్యత నరుంధతీవసిష్ఠు
లైనఁబోఁడఁగానఁగావసిష్ఠాన్వయప్ర
విష్టకౌండిన్యకులవులై వెలయుపార్వ
తెమ్మరాగన్న మహిమనుతింపఁదరమె

క. ఆపుణ్యాత్ములయందును
నాపుణ్యవశంబునన్ మనః ప్రీతిదయం
గాపాడఁ బుడమి వర్ధిలి
చూపట్టితి వీరభద్రశంభునామమునన్.

క. ఆజననీజనకులకును
నేజననంబందితిని హృదీప్సితశైవ
భ్రాజిపదారాధనధర
నైజ మితనికంచుబుధులన్ హర్షమునన్.

క శంకరపదపద్మస్థవి
శంకటహృద్భ్రమరమహితచరితమయిన స
ద్వంకాయలపాట్యన్వయ
పంకజభవవంశజనిత భవ్యుఁడ జగతిన్.

శా. మన్మాతామహువంశమెంచెదను సన్మార్గక్రియాధుర్యతన్

నోన్నాదాగగవుల్ ? కవుల్ సహజభాగ్యోపేతరాట్ఛ్రీయుతుల్
విన్నార్గాప్రవిశస్వభావులు మహావిద్వాంసు లుద్యన్మతిన్

ఉ రామనకేశవార్యుఁడు విరాజితసత్కృతిలింగమంత్రి దు
గ్ధామలవార్ధి నుద్భవమునందిన కౌస్తుభకల్పచంద్ర సం
జ్ఞామహనీయుమ్మత్తులఁ బ్రశస్తివహించిరి దీప్త్యుదారతే
జోమహిమన్ మదన్వయము శోభిలు మాతృపితృక్రమంబునన్.

ఉ. వారికిధర్మపత్నులనివారితసత్కరుణామరీమహో
దారసురత్నముల్ వరుసదారతఁదత్క్రమమొప్పలక్ష్మమాం
బారమణీలలామయు నపారగుణాన్వితరామమాఖ్య దు
ర్వారమనఃప్రసారయగు లచ్చమపాల్చిరి భూప్రసిద్ధిగన్.

క నా మేనమామయు
నామాతామహతనూజుఁడగు వెంకన స
ద్ధాముఁడు గుణముల కవసిత
ధాముఁడు వృజినహృతిపుణ్యధాముఁడు జగతిన్.

క మోచర్లాన్వయదీపకు
లాచారసమగ్రవైదికాచారులు గీ
ర్వాచస్పతు లార్వేలకు
లోచితసద్గుణగరిష్ఠు లూర్జితులు ధృతిన్.

* * * *

చ. సరసతమందపాటికులసంభవులెల్ల నమాత్యవృత్తి వి
స్ఫురితము గా మదన్వయవిభూషణులన్ దయఁబ్రోవుచోఁ గవి
త్వరచన మీఱి వేడుక శివప్రతిపాద్యము నీపురాణమే
గరిమ నొనర్పఁబూనితి నకల్మషనిత్యపదాభిలాషినై.

వ ఏను శ్రీరామచంద్రరాజాంతఃకరణంబున సర్వసంపత్పరిపూ
ర్ణుండనయ్యు విద్వత్సేవావిశేషంబునఁ బుట్టిన విద్యావ్యసనంబున శివర
హస్యఖండము శివార్పణంబుగాఁ దెలుంగు సేయం దలంచెద,

* * * *

మ. ధర నార్వేలకులాగ్రగణ్యుఁ డనఁగా దాక్షాయణీచంద్రశే
ఖరులన్ నిశ్చలభక్తి నిత్యము మనఃకంజాతపీఠాధివా

సరతుల్గానొనగూర్చి మజ్జనకుఁ డోజన్ బుత్త్రిలాభార్థియై
కర మర్థించిన నన్నొసంగిన శివున్ గావ్యేశుఁగాఁ గొల్చెదన్.

**End.**

క. నిటలతటఘటితనేత్రో
ద్భటపావకదళితసుమకదంబకుటుంబో
త్కటదుఃఖహరణపరను
స్ఫుటదమృతకటాక్ష! యానశోభిమహాక్షా!

**Colophon:**

ఇతి శ్రీమదుమామహేశ్వరకరుణాకటాక్షవీక్షణపవిత్రీకృతచరిత్ర రాగనామాత్యపుత్ర వీరభద్రయాభిధేయప్రణీతంబైన శ్రీమత్ స్కాంద మహాపురాణంబునందు, శంకరసంహితయందు, సంభవాసురవీరమాహేంద్ర యుద్ధదేవదక్షోపదేశంబులను సప్తకాండంబులఁగల శివరహస్యఖండంబునందు షష్ఠంబగు దక్షకాండము సంపూర్ణము

గ్రంథాంతమం దిట్లు గలదు.—

దుర్ముఖినామసంవత్సర ఆషాఢ బహుళ ఏకాదశీ సౌమ్యవాసరం వరకు శ్రీమత్పరమవీరశైవాచారసంపన్నులయిన పిడువర్తి కల్యాణయ్యగారి మాతృక చూచి దానిలో ఉన్నప్రకారం శ్రీ అంచెల పాపయ్యకుమారుడు అమరయ్య స్వహస్తముగా వ్రాసుకొన్న శివరహస్యఖండమునందు సంభవాసుర వీరమహేంద్ర యుద్ధ దేవదక్ష ఉపదేశకాండంబులు యేడున్ను గలిగిన శివరహస్యఖండములో ఉపదేశకాండము తప్ప లో తక్కిన ఆరుకాండములు సంపూర్ణము

దుర్ముఖినామసంవత్సరం నిజజ్యేష్ఠ శుద్ధ పంచమి ఆరంభంచేసి ఒక నెలమీద యిరువదిరోజులకు తీర్మానం.

(వి-వి.)—

అసమగ్రము వ్రాఁత మంచిదిగాదు తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంధపాతములు లేవు.

స్కాందపురాణమందలి శంకరసంహితలోని శివరహస్యఖండమునకిది తెలిగింపు. శివరహస్యఖండము సప్తకాండములు గలది కడపటిదగు నుపదేశకాండమిందు లేదు తక్కిన యాఱుకాండములును గలవు. ఈ శివరహస్యఖండమును బలువురు తెలిఁగించిరి. ఈ తెలిఁగింపు వంశా

యలపాటి వీరభద్రకవి చేసినది. ఈతఁడు కౌండిన్య గోత్రుఁడు. ఆర్వేలనియోగి మోచర్లవా రితని మాతామహవంశమువారు వంశ వృత్తాంతము నుదాహృతపద్యములఁబట్టి కనుఁగొనవచ్చును ఈ కవి సూర్యవంశ క్షత్రియుఁడగు మందపాటి రామచంద్రరాజుచే సన్మాని తుఁడై సంపత్సమృద్ధుఁడై యుండెను రామచంద్రరాజువంశవృత్తాంత మునుగూడ నుదాహృతపద్యమందుఁజూడనగు

---

## R No 723

Paper 10¾ × 9¾ inches Foll 296 Lines, 20 in a page Mode of writing, somewhat good, not free from mistakes and breaks off in some places

Restored in 1924–25 from a MS of the Government Oriental MSS Library, Madras

Bound in two volumes Foll 295 and 296 are left blank

బాలభాగవతము

BĀLABHĀGAVATAMU

Same work as that described under R No 27 ante, from which the MS under notice was restored For other particulars see R No 27 ante

Contains the Āśvāsas 1—5 complete and breaks off in the 6th Āśvāsa

(వి-వి.)—

ఇది రెండు సంపుటములుగాఁ గట్టబడినది తొలినుండి యైదాశ్వా సములు సమగ్రముగాను, ఆఱవయాశ్వాస మసమగ్రముగాను (ఆఱవ యాశ్వాసపుభాగము పుస్తకము మొదట) వ్రాయఁబడియున్నది వ్రాఁతయొకమాదిరిగానున్నది తప్పులంత గా లేవు శైథిల్యము లేదు. గ్రంథపాతము లక్కడక్కడకలవు.

ఇది ఆర్ నె 27 రున వర్ణితమైనదే దానికిది పుత్త్రిక

---

## R No 724.

Paper 10¾ × 9¾ inches Foll 222 Lines, 20 in page Mode of writing, not good Contains mistakes and breaks off in many places Good

Restored in 1924–25 from a MS of the Government Oriental MSS. Library Madras

విజ్ఞానానందనాథోపాఖ్యానము.

VIJNĀNĀNANDANĀTHŌPĀKHYĀNAMU

Foll 1*a*–221*a* Foll 221*o*–222*b* aie left blank
Same woik as that desciibed undei R No 706 ante
Complete

(వి వి)—

సమగ్రము వ్రాంత మంచిదిగాదు. తప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాతములు గలవు.

ఇది ఆర్ నె 706 రున వర్ణితమైనదే దానికిది పుత్రిక. ఈ ప్రతికంటె దీని మాతృకయే బాగుగానున్నది

---

## R No 725.

Paper 10¾ × 9¾ inches Foll 320 Lines, 20 in a page Mode of writing, very bad, full of mistakes and breaks off in many places Good

Restored in 1924–25 from a MS of the Government Oriental MSS Library, Madras

Bound in two volumes

శేషధర్మములు.

ŚĒSADHARMAMULU

Same work as that described undei R No 704(*a*) ante By Śivaiāju Siddhirāju, son of Ayyaparāju

Āśvāsas 1–5 complete

(వి.వి)—

సమగ్రము. వ్రాంత రోంత తప్పుల కుప్ప శైథిల్యము లేదు. గ్రంథపాతములు తండోపతండములు.

ఇది ఆర్. నె 704-(a) రున వర్ణితమైనదే. దానికిది పుత్రిక. దానిలో (b) పుస్తకముగూడ నిందు గలదు

---

## R No 726.

Paper 10¾ × 9¾ inches Foll 92 Lines, 20 in a page. Mode of writing, not good, full of mistakes and breaks off in many places Good

Restored in 1924–25 from a MS of the Government Oriental MSS

రామగీతలు.

## RĀMAGĪTALU

A Telugu rendering of the Sanskrit work of same name which is a treatise of a philosophical character dealing with the greatness of Rāma The author Śivarāmakavi of Nellore, who is also the author of Kāmakalānidhi, was the son of Sūramāmbā and the well-known Vīrarāghavāmātya, the work was written at the instance of Manu Kṛṣṇabhūpāla and was dedicated to God Śrī Rama worshipped at Kṛṣṇāpuram For other particulars see the extracts given below

Complete in 6 Āśvāsas

**Beginning.**

సీ. శ్రీజానకీకుచశ్రీగంధయుతవక్ష
వక్షదానవభుజబలవిశాల
శాలలోచనసురప్రభుకృతసన్మాన
మానవలోకనిర్మాణదక్ష
దక్షసు॥ నుతస్వపదాంభోజ
మైథిలీ విహార
హారహీరపటీరహారయశస్సార
సారసహితవంశజలధిచంద్ర
చంద్రికాహాసభాసిత సర్వలోక
లోకపాలకసన్నుతాస్తోకవిజయ
విజయజయకృతనుతిసోమవిజయరాము
రామకృష్ణాపురీధామ రాజసోమ

గీ. అవధరింపుము దేవర కంకితముగ
రామగీతలు సంస్కృతాంధ్రప్రకర్ష
భాషణంబుల విదులకుభావశుద్ధి
గలుగ రచియింతు బుధలెల్లగణనసేయ.

**Colophon**

ఇది శ్రీమద్గురుచరణారవిందమళిందాయమానమానస శ్రీరామచంద్రపూజావాప్తసంపద్విలాస నెల్లూరి వీరరాఘవప్రధానితనూభవ సూరమాంబాకుమార సకలాంధ్రశాస్త్రలక్షణసామ్రాజ్యసార్వభౌమ శివరామనామప్రణీతంబైన రామగీతలయందు షష్ఠోల్లాసము.

**End** :

సీ. అని పరమేశ్వరుండానతిచ్చె నటంచు
గృతి . లెల్ల
శబ్దసంగతినాంధ్రసంస్కృతవాగ్గుంభ
గంభీరలక్ష్యలక్షణము లమర
రామషడక్షరీరాజమంత్రాత్మక
ముగ షడుల్లాసముల్ పొసఁగఁజేసి
బహుళప్రయోగముల్ . . దాహా
రణముల రసములరాజితముగ
నుండునీకృతిలోఁ దప్పు లుండుననుచుఁ
బదరి యూరకే యాక్షేపభంగిఁ జొరక
సుకవులు కుయుక్తిఁ జూడక రసూయ
కరుణ నంగీకరింప నాకాంక్ష సేతు.
సీ. శ్రీమజ్జైకులవార్ధిశీతమయూఖుండు
జనకుల గోత్రవిస్తారకుండు
నలకృష్ణవిభునకు నాసర్వమాంబకుఁ
బౌత్రుండు సద్గుణభరితుఁడైన
వేంకటకృష్ణభూవిభునకు వేంగమాం
బకుఁ దనూభవుఁడు వైభవబిడౌజుఁ
డగు కృష్ణభూపాలుఁ డాత్మనామాంకిత
పురవాసియైన రామునకు నంకి
తంబుగా రామగీతలు తత్త్వబుద్ధి
నక్షరషవర్ణసమపంక్తినర్చ్చ చేసి
యీ మహాకృతి () నెన్నికెక్కి,
జగతినాచంద్రతారార్కముగఁ జెలఁగును

* * * *

మాలిని దశముఖమదహారీ తాటకాప్రాణహారీ
దశరథపురనారీధర్మరాజ్యానుకారీ.

* * * *

(వి-వి)—

సమగ్రము. వ్రాఁత మంచిది కాదు తప్పులకుప్ప శైథిల్యము లేదు. గ్రంథపాతములు మిక్కిలి.

సంస్కృత భాషలో రామగీతలను పేరఁ గల వేదాంత గ్రంథమున కిది తెలిగింపు ఆ ఆశ్వాసకుడు గ్రంథకర్త నెల్లూరి శివరామకవి కామకలానిధి యీతని కృత్యంతరము ప్రఖ్యాతుఁడయిన నెల్లూరి వీర రాఘవకవి కీతఁడు కొడుకు. కృష్ణాపురమున వెలసిన శ్రీరామదేవున కర్పణముగా మతికృష్ణభూపాలుని ప్రేరణముచేఁ గవి యీ గ్రంథమును రచించెను. కృష్ణభూపాలుని వంశవిషయము నుదాహృతపద్యమునఁ జూడనగును.

---

## R No 727.

Paper 10¾ × 9¾ inches Foll 60 Lines, 20 in a page Mode of writing, not bad, not free from mistakes and breaks off in many places Good

Transcribed in 1924–25 from a MS of M R Ry Gūda Venkatēsvaragāru, Jaladanki, Kavali taluk, Nellore district

రామగీతలు

RĀMAGĪTALU

Same work as that described under the previous No

Contains the Ullāsas 3—6 complete

(వి-వి)—

మూఁడవయుల్లాసమునుండి కడదాఁకఁ గలదు. వ్రాఁత యొకమాదిరిగానున్నది తప్పు లంతగా లేవు గ్రంథపాతములు హెచ్చుగా నున్నవి

ఇది నెం ౭౨౬ రువ వర్ణితమైనదే. ఆ ప్రతికంటె నిది కొంత శుద్ధమై యున్నది

---

## R No 728.

Paper 10¾ × 9¾ inches Foll 172 Lines, 20 in a page Mode of writing, good, free from mistakes and breaks off in some places Good

Transcribed in 1924–25 from a MS of M R Ry Śiidharam Dharmarājugāru, Rapur, Kandukur taluk

సౌగంధికాపహరణము.

SAUGANDHIKĀPAHARANAMU

Same work as that described under R No 173(c) ante As the MS under notice contains many historical points which are not found in the MS described under R. No. 173(c), a full description has been given hereunder

117

Complete
Fol 172*b* is left blank.

**Beginning :**

శ్రీరామచంద్రుఁ డాశ్రితవత్సలుండు
తారకబ్రహ్మావతారుఁ డచ్యుతుఁడు
నముచిసూదనముఖ్య నానాదిగీశ

*    *    *    *

సంతతకరుణారసస్వచ్ఛహృదయు
సకలవేదపురాణశాస్త్రార్థకార
వికటమదోద్దండవేదండసింహు
నరుదైన బ్రహ్మరథారోహణాఢ్యుఁ
జిరతరకీర్తిదేశికచక్రవర్తి
రంగనాయకపాదరాజీవయుగ్మ
సంగతపటుహృద్యసచ్ఛంచరీక
భట్టారు శ్రీచెన్నభట్టరాచార్య
పట్టభద్రులపాదపద్మముల్ దలచి
వరయశోధనుల గీర్వాణాంధ్రకవుల
నిరతంబుగ నుతించి నేర్పువహించి
చాటువాక్యార్థ లక్షణలక్ష్యశబ్ద
నాటకాలంకారనవ్యప్రబంధ
సారార్థసంగ్రహ సర్వజ్ఞమూర్తి
కారుణ్యజలధి ముంగరకాసుకవి
చంద్రచారిత్రముల్ జననాథసభల
సాంద్రమతిస్ఫూర్తి సన్నుతుల్ సేసి

*    *    *    *

రావిళ్లలింగభూరమణచంద్రుండు
కోవిదవినుతుఁడై కొలువుననుండి
నామీఁదఁ గృపయుంచి నన్నుఁ రావించి
ప్రేమతో లాలించి పెంపుఁ జేయించి
తాంబూలయుతముగా ఘనమణిహార
జాంబూనదాంబరసైంధవాందోళి
కాదులు తగనగ్రహారంబు లొసఁగి

నాదెకుకొపేక్షించి నయమొందఁబలికె
అనుపమరత్నాకర(రాన్వయా ?) ధ్యత్త
ఘనుఁడు(డ?) గోపాలసత్కవిసార్వభౌమ !
సరసుతమధురవాఙ్నైపుణ్యమతివి
సరసచాతుర్యలక్షణలక్ష్యశబ్ద
నాటకాలంకారనవరసభావ
పాటవంబులను నేర్పరి వీవె జగతి
నెటి నిరోష్ఠ్యంబుల నిరనునాసికల
గురుతైనశతకము ల్గూర్చినమేటి
వనునాసికోష్ఠవర్ణావళి సోరని
గొనబుతారావళి గూర్చినఘనుఁడ
వలకామునికి నిబిడాంధ్రశబ్దంబు
నెలమిమీఱఁగరచి యుంచునేర్పరివి
కవులెన్నఁగాఁజెకుకట్న ? మార్గంబు
లవలీలఁజెప్పినయట్టి ధన్యుఁడవు
మహనీయబహులిపిమర్మచాతుర్య
మహిమలు దెలిసిన మాన్యుఁడ వీవె
భవ్యసౌగంధికప్రసవాపహరణ
కావ్యంబు ద్విపదగాఁ గడు విస్తరించి
తనరు వేడ్కలనంకితము సేయవలయు
ననినను హర్షించి యానందమొంది
సంశయం బెడలించి సత్యతనాదు
వంశావతారంబు వర్ణింతు నెలమి

* * * *

పరగ శ్రీహరి పాదపద్మంబువలన
సురనదితోఁగూడ శూద్రకులంబు
గలిగె వారలలోనఁ గమ్మవంశంబు
బలశౌర్యధైర్యప్రభావచాతుర్య
వరదానధర్మదుర్వారసంపదల

* * * *

మానితవర్ణాశ్రమములవారలకు
భూనుతంబగు కల్పభూజవనంబు

కరణి నాధారమై ఘనతరకీర్తి
బిరుదుసంపదలచేఁ బృథ్విపై వెలసె
ఆకమ్మవంశసుధాంభోధియందు
రాకానిశాకరు రమణుఁడై నెన్నఁడి
యనుపమాటోపసాహసవిక్రమార్కుఁ
డనుచు రాయకుమారు లభినుతియించ
వినుతరాడ్భయదమై విస్మయంబగుచు
గొమరొందుగుడిపాటి కోటచెంగటను
కుతలాధిపతులెల్లఁ గొనియాడిమెచ్చ
కుతుపుశౌహబలంబు గోరించి నఱకె
చెల్లుగారాయలుచ్చుబిరుదు ?
తెల్లఁగైకొని మదాంకితరాజహృదయ
భల్లప్రతాప ప్రభావుఁడై పీర
మల్లభూరమణుండు మహిఁ గీర్తి నించ
వినుతులుగాంచు రావిళపీగమల్ల
జననాధచంద్రవంశంబున నలరి

* * * *

జననాథు లెన్నంగ జగతిపై వెలసె
ఘనుఁడు తిప్పక్షమాకాంతశేఖరుఁడు
ధీరత రావిళ్లతిప్పభూవిభుఁడు
హేరాళముగ ధాత్రి నేలుచునుండి
భుజబలోద్దండుఁడై పొదలుచువచ్చు
గజపతిదళములఁ గదిసి చెండాడి
వికలంబుగాఁజేసి వెనొకట్టి తఱిమి
యకలంకబిరుదధ్వజావళుల్ పట్టి
గొడుగు లందలములు గొనజపల్లకులు

* * * *

జనపాలు రెన్న రాజ్యము సేయుచుండి
పరమసాధ్వీమణి పటుశీల యనఁగఁ
బరగుశ్రీపెద్దమాంబాగర్భమునను
హరిహరసదృశులై యలరినసుతుల
నిరువురఁ గాంచె మహీశసన్నుతుల

బలశౌర్యధనుఁ డయ్యపక్ష్మాతలేంద్రు
నఘుతేజుని వేఁకటాద్రి భూధవుని
నరయ నాయిరుపురయం దగ్రజుండు
పరమపావనుఁడయ్యపక్ష్మాతలేంద్రుఁ
డతిశీలవతి లక్ష్మమాంబికయందు
సుతుని శ్రీతిప్పవసుంధరాధిపుఁ
గని పెంచి సకలభూకాంతులు గొలువ
పసుపడఁ డినయుని బట్టంబుఁగట్టి

* * * *

అతని తనూభవుండగు తిప్పనృపతి
కుతలాధిపతులు మిక్కుటముగా నెంచ
ధరణిఁ బేరైన యాదవునిమన్నఁబు
సురతాణిలగ్గగాఁ జూఱ లాడించి

* * * *

కలపాటిగాంధ్రఁ జీకాకుగాఁ దఱిమి
చెలరేగి జయలక్ష్మిఁ జేకొనివచ్చి
చల్లఁగా నలహరిశ్చంద్రునిలీల
నెల్లమహీస్థలి నేలుచునుండు
నంగనాజనమణి యలినీలవేణి
శృంగారవతి యని చెలువందునట్టి
వెంగమాంబికయందు వితరణకర్ణు
లింగభూపాలు లాలితయశోధనుని
గనియె నాలింగభూకాంతశేఖరుఁడు.

* * * *

పరగునత్త్రావుల పర్వతాధిపుని
కన్నియ సిద్ధాంబ కరుణావలంబ
నెన్నఁగాఁ బెండ్లియై యొసఁగుచునుండి
నీరజాక్షప్రభా నిశితాసివిజిత
ఘోరాహితనృపాలుఁ గొండభూపాలు
సతతవదాన్యుఁ బ్రసన్ను సత్కాంతి
జితచంద్రు నయ్యపక్షితినాథచంద్రుఁ

బుత్త్రులఁగాఁగాంచి పొలుపు వహించి
ధాత్రీపతులు మెచ్చ ధరణిపై వెలసె
ఆకుమారులలోన నహితరాజన్య
భీకరశౌర్యుండు భిమబలుండు

* * * *

నరశౌర్య(?)ముఖ్య నానాభవ్యబిరుద
భరితుఁడు కొండభూపాలశేఖరుఁడు

* * * *

బలియుఁడా కొండభూపాలసోదరుఁడు
విలసితసాహసవిక్రమారూఢుండు

* * * *

నరసుతుఁడయ్యవనాయకేంద్రుండు
రావిళ్ళ (జిల?) వెలయుఁ గర్ణాటశ్రీరామ
రాజదత్తకిరీట రమ్యభూషణుఁడు

* * * *

ఆమోద మెసఁగ నయ్యపనాయకేంద్ర
భామిని వెంగమాంబామణిగర్భ
జలనిధిసంపూర్ణచంద్రునిలీలఁ
గలిగె శ్రీకొండ భూకాంతశేఖరుఁడు

* * * *

ఆకొండనృపతి బాహాబలోదగ్ర
భీకరశౌర్యగాంభీర్యచాతుర్య
వినయవివేకప్రవీణులైనట్టి
తనయుల నిర్వురఁ దగఁగాంచి
(రామభద్రకుమారమణి, తిమ్మధాత్రీకళత్రులు వారిపేళ్లు)

* * * *

రాజీవతేజుండు రావిళ్లలింగ
భూజానికొండ భూభుజుఁడు మోదమున
సొలవక పుత్త్రుల సుముహూర్తమునను
జెలఁగుచు రాజ్యాభిషిక్తులఁ జేసి

మంతు కెకిరానమెట మన్నిలతోడ

* * *

పొదలుచు మానవపురి చెంతఁజేరి
పదరు నేదులశాహి బలములమీఁద
కోదకక హరిణంపు గుంపులమీఁద
కొదమసింగముసొచ్చు కొమరుచెన్నొందు
తేజిని జేసల్ల దేయనిమాణి
యాజిరంగముసొచ్చి యహితసైన్యముల
కకవికల్ గావించి గద్దించి నలికి
ప్రకటించి తనపేరువాసిపోనీక

* * * *

ఆచంద్రతారార్క మగునట్టికీర్తి
భూచక్రమున నించి పొరిలో వెలసె
ఆమన్నెహంపీరు నాత్మజులందు
రామాభిరాముండు రణభయంకరుఁడు

* * * *

ఘనుఁడు రావిళ్లలింగనృపాలుచంద్రుఁ
డెనయు వేడ్కలధాత్రి యేలుచునుండి

* * * *

సాయువనాయని సతులాలాఢ్యుండు
శ్రీయనంతనృపాల శేఖరుం డెలమి
ధరణిభాగీరధితరళాక్షిఁబోలి
పరగుశ్రీరంగ మాంబాగర్భమునను
గన్న సద్గుణధామ కాంతాలలామ

* * * *

పరగుశ్రీభాసర్కరాం బాపయోజాక్షి
వరముహూర్తమున వివాహమై ప్రేమ

* * * *

కలితచాతుర్యవిక్రమధురంధరుని

రామభద్రనృపాలు రమణీయశీలు
శ్రీమంతుబాంధవాశ్రితకల్పవృక్షు

* * * *

తిరుమణికోటలో స్థిరముగానిలిచి
పరవీరదుర్గముల్ పట్టణంబులును
నదలించి బెదరించ నావార్త దెలిసి
పొదలుసుల్తాని యద్దాలపాదుశాహు
మలయుడు నేదార్ల మన్నీలఁ బిలిచి
సెలవుమన్నించిన శీఘ్రమే తరలి
చతురంగబలములు సంరంభ లగుచు
ధృతిమీఱఁగా నలుదిక్కు-లుద్రిమ్మ

* * * *

మేటిమనేదార్ల మెఱయువజీర్ల
ఘోటకమత్తేభకోటులఁ జదిమి
హేలఁ బైపైఁ జొచ్చి యెల్లశాత్రవుల
ద్రోలి పెన్గొండకుఁ ద్రోవలనూకి

* * * *

అని వేఁడుకొనిన దయాదృష్టిఁ జూచి
తనరు వేడ్కల ధర్మదారవట్టించి
సమరంబు సాలించి చయ్యనమరలి
రమణతో ధారుణీ రమణులచేత
దళవాయి వెంకటధరణీశు చేత
నలరుచుఁ దగు హెచ్చులగు మెచ్చులంది
రావిళ్లలింగభూరమణచంద్రుండు

* * * *

అగుకోటపాటి మాకావసీంద్రునకు
తగ నుద్భవించిన తరుణీలలామ

* * * *

తిరుమలాంబామణి స్థిరలగ్నమునను
జెలఁగి కళ్యాణమై సిరులఁ జెన్నెరి

* * * *

వెంగధాత్రీనాథు విమలచారిత్రు
తనయుని గాంచి యాధరసేసు లెస్స
వినుతసంపదలచే వెలయుచునుండు
శశివరవితరణసాహసశాలి
విశదచారిత్రుండు వెల్లుర్తిగోత్ర
పాత్రుండు సకలార్థి బాంధవపద్మ
మిత్రుండు లింగభూమీశపుత్రుండు

అనియిట్లు సకలగుణాభిరాముసకు

గురుతరరాజిల్ల కులభూషణునకు
ధరనెన్నదగు లింగధారుణీపతికి
నంకిత బుగను నే నార్యులుమెచ్చ
పొంకించి రచియింపc బూనినయట్టి
పరమసౌగంధిక ప్రసవాపహరణ
సరససత్కృతికథా సరణి యొల్లనిన

**End**

విన్నవారలకెల్ల విభవసంపదలు
సన్నుతవస్త్రభూషణములుగల్గు
నెలమూcడువానలు నెలకొని కురియు
బలుసస్యసంఘముల్ ఫలియించునెపుడు
సురచిరకళ్యాణశోభితంబగుచు
ధరణీజనమెల్లc దనరుచుండుదురు.

(వి.వి.)—

సమగ్రము. వ్రాత తిన్ననిది తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు గ్రంథపాతము లక్కడక్కడ కలవు

ఇది మైసూరు 173 రున వర్ణితమైన గ్రంథమే. కృతిపతి వంశవిస్తార మిక్కడ సరిగాcజూపcబడినది

## R No 729

Paper $10\frac{3}{4} \times 9\frac{1}{4}$ inches Foll 200 Lines, 20 in a page. Mode of writing, not good, full of mistakes and breaks off in many places' Good

Restored in 1924-25 from a MS of the Government Oriental MSS Library, Madras

Bound in two volumes Foll 154b, 156b and 200 are left blank

సురతాణీపరిణయము

SURATĀNĪPARINAYAMU

Same work as that described under R No 473 ante, from which the MS under notice was recopied For other particulars see under R No 473 ante

Complete

(వి-వి.)—

రెండు సంపుటములుగాఁ గలదు సమగ్రము వ్రాత మంచిది గాదు తప్పులు గ్రంథపాతములు గలవు శైథిల్యము లేదు

ఇది ఆర్ నె 473 రున వర్ణిత మయినదే. దానికిది పుత్త్రిక.

---

R No 730.

Paper $10\frac{3}{4} \times 9\frac{1}{4}$ inches Foll 72 Lines, 20 in a page Mode of writing, bad. Full of mistakes and breaks off in many places Good

Transcribed in 1924-25 from a MS of the Raja of Venkatagiri, Nellore district

కృష్ణార్జునసంవాదము.

KRSNĀRJUNASAMVĀDAMU

A Prabandha narrating the story of Gaya who offended Lord Krsna but sought protection from Arjuna As the MS under notice breaks off in many places and is without beginning or end, it is not possible to trace out the name of the author and the extent of the work

Incomplete

**Beginning.**

క. శ్రీ గంగాధరసన్నుత
సాగరజాహృదయ సదన సారస నయనా

**End:**

క. నా నేరము మదినెంచక
దానవమదభేది నీవు దయతోఁ గయుఁడై
ప్రాణములు కాచి బ్రోచితి
శ్రీనాథా పరమపురుష చిత్తజజనకా !

వ. అని బహుప్రకారంబుల నుతిచేసి తదనంతరంబు

(బి బి) —

అసమగ్రము  వ్రాఁత మంచిదిగాదు.  తప్పులెక్కువ  గ్రంథ పాతము లమితముగా నున్నవి  శైథిల్యము లేదు.

గ్రంథపాతము లమితమగుటచేతను ఆద్యంతములు లేకపోవుటచేతను గ్రంథమాశ్వాసబంధము గలదిగాఁ గానరాకుండుటచేతను, కర్తృత్వాదికము గుర్తింపరాకున్నది  గయోపాఖ్యానము కథ యిందు వర్ణితమయినది

---

## R No 731

Paper 10¼ × 9¾ inches Foll 28 Lines, 20 in a page Mode of writing, not bad and free from mistakes and omissions Good

Restored in 1924–25 from a MS of the Government Oriental MSS Library, Madras

Fol 28 is left blank

నంజరాజచరిత్రము

## NAÑJARĀJACARITRAMU

A prose rendering in Telugu of the Sanskrit work on poetics Nañjarajayasōbhūsana attributed to Nrsimhakavi alias Abhinavakāldāsa of Ālūr The work is written in glorification of the Kannada king Nañjarāja (son of Vīrarāja) who was ruling at West Srirangam, now called by the name Seringapatam, situated on the banks of the river Kāvēri, near Mysore

Contains the Nātakōdāharana complete

**Beginning:**

శ్రీరంగపట్టణము ప్రభుత్వముచేసిన నంజరాజు చరిత్రము. శ్రీరంగపట్టణమని యొకపట్టణమనాదియమై కావేరితీరమందు ఉండెను. ఆ పట్టణమందు అనేకదినములనుండి బహుభాగ్యవంతుడును భగవదనుగ్రహమునకు పాత్రుడును అయిన నంజరాజనే రాజు ప్రభుత్వము చేస్తూ

ఉండెను ఆయనకు శ్రీరంగనాథస్వామి ప్రత్యక్షమై సకల భాగ్యంబు లిచ్చుచుండెను దేవతావరలబ్ధ సామర్థ్యుడై తన పరాక్రమముచేత సకల దేశములు జయించి సకలదేశములను తనస్వాధీనమందుంచుకొని,

*  *  *  *

అటుతర్వాత ఆ విద్వాంసులలో సకలశాస్త్రములను ఎఱిగినవాడగు శివరామ శాస్త్రుర్లు అని పేరుగలిగి ఉండెను ఆయన కుమారుడు నవీనకాళిదాసు అని పేరుగలిగిన నరసింహ శాస్త్రుర్లు నేను మీవిషయముగ ప్రబంధమును నిర్మాణము చేస్తానని మందలించినాడు. ఆతరువాత ప్రభువు బహుసంతోషపడి సకల బహుమానములుచేసి తాంబూలము చేతికి ఇచ్చి ప్రబంధము నిర్మాణించుమన్నాడు ఆ శాస్త్రుర్లు ప్రబంధముచేసి యీ ప్రబంధముకు నంజరాజయశోభూషణమని నిశ్చయముచేసెను ఆతర్వాత నొకనాడు ప్రభువు బహుసంతోషపడియుండేటప్పుడు యీ ప్రబంధమును తీసికొనిపోయి కచ్చేరిలో ప్రభువుచేతికిచ్చెను ఆతర్వాత ప్రభువు ఆ పుస్తకము తీసికొని నరసింహ శాస్త్రుర్లకు తొమ్మిది అంబారీలు పన్నెండు హాయ రత్నములు ముత్యాలపల్లకి లక్ష వరహాలున్ను పన్నెండువేల వరహాలు యెత్తే తాలూకా జాగీరున్ను ఇచ్చినాడు. తరువాత ఆ ప్రబంధమును అనేకమంది శిష్యులకు పాఠముచెప్పినాడు అందరున్ను ఈ నాటకమును నేర్చుకొని సుఖంగా ఉండిరి

**End:**

ఈ రాజు ప్రభుత్వముచేస్తూ ఉండేటప్పుడు నిత్య ఒక గజదానమున్ను పదిగోదానములున్ను విద్వాంసులకు ఇచ్చుచువచ్చినవాడాయెను గజదానమునకువేయి వరహాలు దక్షిణ. గోదానమునకు నూటపదహారు వరహాలు దక్షిణ. ఈ ప్రకారము బ్రాహ్మణుల కిచ్చుచుండెను

(వి-వి.)—

సముగ్రము వ్రాత చెడుకమాదిరిగానున్నది తప్పులులేవు శైథిల్యములేదు గ్రంథపాతములు లేవు

అభినవకాళిదాసను బిరుదుగల ఆలూరి నరసింహ కవిచే రచితమయిన నంజరాజయశోభూషణమను నలంకారశాస్త్రగ్రంథమందలి నాటకోదాహరణమున కిది తెలుఁగు వచనము. ఇందు నంజరాజు కీర్తిప్రతాపాదికము కీర్తింపఁబడినది. ఈ నంజరాజు, పశ్చిమ శ్రీరంగపట్టణము రాజధానిగాఁగర్ణాటదేశము పాలించెను ఈ రచన మెవరు రచించిరో యెఱుఁగరాదు.

## R No 732.

Paper $10\frac{3}{4} \times 9\frac{1}{4}$ inches. Foll 52 Lines, 20 in a page Mode of writing, not good and not free from mistakes Breaks off in one place Good

Restored in 1924–25 from a MS of the Government Oriental MSS Library Madras

Foll 50b—52b are left blank

పలుకనిపద్మావతికథలు.

### PALUKANIPADMĀVATIKATHALU

A story relating to the princess Palukani Padmākshi or Padmavati who was out-witted by the well-known king Vikramaditya and was given by him in marriage to a prince The story contains several minor stories and is written in homely Telugu

Complete

**Beginning:**

ఉజ్జయిని మహాకాళి అనేపట్నం వకటి ఇటువంటిపట్నం యేలే టటువంటి విక్రమార్క మహారాజు ఆరాజుకు భట్టియనే మంత్రి. రాజునకు ప్రాణముగా ఉండబడ్డటువంటి బేతాళుడు ఇట్లా రాజ్యము చేసుకొనియుండగా ఆ పట్టణములో నారాయణ దీక్షితులనే బ్రాహ్మణుడు ఆ బ్రాహ్మణుడు కాశీయాత్రకుపోయి గంగా కావడి కట్టుకొని రాగాను విక్రమార్క మహారాజా కని ఆ బ్రాహ్మణునికి దండప్రణామములు చేసి అయ్యా నీవు పోయినటువంటి దేశములలో ఏమేమి దృశ్యములు కనివచ్చితిరి అని రాజడుగగా ఆ బ్రాహ్మణుడు రాజుతో నిట్లనియె.

**End**

ఆ చిన్నదానికి నాకు వివాహము శేయిస్తే సరి, లేకపోతే నేను ప్రాణత్యాగము చేసెదనని చెప్పెను అప్పుడు విక్రమార్క మహారాజు పద్మాక్షినిచూచి ఈ రాజకొమారుని నీవు వివాహము చేసుకొనెదవా అని అడిగెను. మంచిది మీ మనస్సునకు సంతోషమైన ప్రకారము సేయుమని చెప్పెను. అప్పుడు విక్రమార్క మహారాజు ఆ శృంగారమన్మథుడనే రాజుకు వివాహము చేయవలెనని సకలమునైన బంధువర్గములను పిలిపించి మహా ఉచితముగా పందిలివేయించి ముత్యములు నవరత్నములతో శృంగారించి పలుకని పద్మాక్షి తల్లిదండ్రిని పిలిపించి వారికి సమ్మతిచేసి శృంగారమన్మథునికి పలుకనిపద్మాక్షికి నలుగుపెట్టి నడిపించే కృత్యములన్ని

నడిపించి శుభలగ్నమయిన వేళచూచి రాజు వివాహముహూర్తము సేయించి సకలమయిన రాజులకున్ను మహా ఉచితముగా విందులుసే యించి పంపిరి

(వి-వి)—

సముగ్రము. వ్రాఁత మంచిదిగాదు తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు గ్రంథపాత మొకటి-చోటమాత్రము కలదు

పలుకని పద్మాక్షియను రాజకన్యను విక్రమార్కు- మహారాజు శోధించి సేవకురాలినిగాఁజేసికొని యొక రాచకొమరునకిచ్చి వివాహము చేయు టయను ప్రధానకథలో వింతలయిన యవాంతర కథలు గొన్ని యిందుఁ గలవు ఈ గ్రంథము వాడుక భాషలోనున్నది. కర్త తెలియరాఁడు.

---

R No 733.

Paper 10¾ × 9¾ inches Foll 20 Lines, 20 in a page Mode of writing, good, but not free from mistakes Good

Transcribed in 1919-20 from a MS of M R Ry Kotikalapūdi Śivarāmadāsa Pantulugāru, Bobbili

Foll 19*b* and 20 are left blank

లోకచంద్రికటీక.

LŌKACANDRIKATĪKA

A commentary in Telugu on the Sanskrit work Lōkacandrikā dealing with astrology by Tātā Jagannāthasūri who has written the Telugu commentary on his own Sanskrit work The work is divided into four Adhyāyas, i e, (1) Bhavasādhanādhyāya, (2) Drstisadhanādhyāya, (3) Balasādhanādhyāya, and (4) Āyurdāyādhyāya

Contains the Jātakabhāga only

**Beginning**

శ్లో. విఘ్నం నత్వావిధిహరముఖైర్వందితం దేవబృందై
ర్నానాపద్యత్యుదితమఖిలం జాతకార్థం విలోక్య
సర్వోపాధైరతిమతిమతాం ప్రీతయే హోరికాణాం
వక్ష్యే హోరాగణిత సరణిం లోకనాథస్సమాసాత్ ॥

* * * *

గ్రంథకర్త ఇష్టదేవతా నమస్కారంచేసి జాతకానయనం చెప్పు చున్నాడు జాతకమునకు జన్మకాలము ప్రధానము గనుక జన్మసమయ మును దెలిసికొనేలక్షణం, సమముగానున్న పుగచ్చుఅయిన భూమియందు ద్వాదశాంగుళ శంకుస్థాపనచేసి దాని ఛాయాంగుళములవల్లగాని యితర యంత్రములవల్లగాని స్పష్టంగా తెలిసికొని జాతకం నిర్ణయించునది

**End**

ఈలాగుననే అన్ని గ్రహాలకు తిరుగా ౨ర శుద్ధిచేసేది ఇది జీవ శర్మాయుర్దాయమగును ఈలాగుననే దేవలుఁడు గ్రీకాచార్యులు మొద లయినవారు

శ్లో॥ యే ధర్మే నిరతా జితేంద్రియవయా యే పథ్యమేవాశినో
యే దేవద్విజపూజకా జగతి యే సర్వప్రియా నిత్యశః
తేషామాయురిదం మయా నిగదితం యే పాపలుబ్ధాః ఖలా
దేవబ్రాహ్మణనిందకా బహుభుజస్తేషామకాలే మృతిః ॥

స్పష్టోర్థః

**Colophon:**

ఇతి శ్రీతాతాజగన్నాథసూరివిరచితాయాం లోకచంద్రికాంధ్ర భాషాటీకాయాం ఆయుర్దాయాధ్యాయశ్చతుర్థః

(వి-వి)—

సమగ్రము వ్రాఁత చక్కనిది తప్పులున్నవి. శైథిల్యము గ్రంథ పాతములు లేవు

తాతా జగన్నాథసూరియను విద్వాంసుఁడు సంస్కృతమున రచి యించిన లోకచంద్రికయను జ్యోతిషగ్రంథమునకిది యాతఁడే రచియించిన తెలుఁగు టీక. ఇందుమూలముగూడఁగలదు భావసాధనాధ్యాయము, దృష్టిసాధనాధ్యాయము, బలసాధనాధ్యాయము, ఆయుర్దాయాధ్యాయ ము నని యీ గ్రంథము నాల్గధ్యాయములు గలది. జాతకభాగవిషయము లిందు వివరింపఁబడినవి.

---

## R No 734.

Paper 10¾ × 9¾ inches Foll 85 Lines, 20 in a page Mode of writing, good, but not free from mistakes Good

Transcribed in 1920-21 from a MS of M R Ry A Lakṣmīvaraprāsāda Pantulugāru, Clerk, Taluk office, Tenali.

Fol. 85*b* is left blank

రఘుపతిరాయవ్యయము

## RAGHUPATIRĀYAVYAMU

A treatise on Advaita-Vēdānta in Telugu. The author Raghupati-rāyakavi has dedicated this work to god Rāma and was an Amildar in the court of Vijayarāmarāja of the Vijayanagara kingdom. For other particulars see the extracts given below.

Contains the first Āsvāsa only.

**Beginning**

శా. శ్రీకల్యాణగుణాశ్రయంబు విజయశ్రీదేవికిం బ్రాపు శ్రీ
కాకుత్థ్సాన్వయదుగ్ధవారిధికి రాకాపూర్ణచంద్రోదయం
బాకైవల్యసుఖంబు నిచ్చుటకు నుద్యద్దేశికోత్తంసమై
సాకేతంబున నొప్పు దాశరథి శశ్వచ్ఛ్రేమ నన్ బ్రోవుతన్

* * * *

మ. ధర మున్నాంగికులాంబురాశివిధునిన్ దైవజ్ఞచూడామణిన్
హారితత్వామృతపానచిత్తయుతునిన్ హంసప్రభాభాసురున్
వరరామాయణకావ్యబోధగురునిన్ వైరాగ్యశుద్ధాత్మునిన్
కరుణాంభోనిధి నాత్మలోఁదలఁతు వేడ్కన్ వేంకటాచార్యునిన్

క. శ్రీవిష్ణుపరాత్మత్వము
శ్రీవిభవముఁ దెల్పినట్టి చిద్బోధగురున్
శ్రీపత్స చిహ్నభట్టరు
శ్రీవనితావరకుమారశేఖరుఁ దలఁతున్.

* * * *

క. శ్రీసురభికులపవిత్రుని
శ్రీసచ్చిత్సుఖపరాత్ముఁ జిద్బోధకరున్
శ్రీసాళీల్యుని సాక్షా
త్కోసలవిభు రామచంద్రగురుమణిఁ దలఁతున్.

* * * *

గీ. ఆంధ్రులయి యాంధ్రభాషచే నఖిలవేద
శాస్త్రితత్త్వార్థబోధసంసక్తి నలరి
కడకునయ్యాంధ్రమును దూలకరణిఁ దలఁతు
రరయ నిట్టిగురుద్రోహు లవనిఁ గలరె?

* * * *

సీ. వారికి శ్రీహరిపంచాయుధాంశజు
    లౌ యన రఘుపతిరాయసూరి
యనఘుడు రామయ్య యతివర్యాన్వితుండగు
    లక్ష్మీనృసింహుండు లలితగుణులు
వెంకటచలమయ్య వెంకటకృష్ణయ్య
    లనువారు గల్గి రందగ్రజుండు
శ్రీరామభగవదర్పితచిత్తకమలుండు
    ఘనవిశుద్ధజ్ఞాన జనహితుండు
విజయనగరావనీంద్రుండౌ విజయరామ
రాజగజాధినాథుని రాజ్యమందు
ఘనులు మెచ్చ నమల్దారి పని యొనర్చి
సాధులను గొల్చి చిత్తవిశ్రాంతి గంటి

**End:**

అజహరహరిరూపా వ్యర్ధదైత్యేంద్రకోపా
భుజగరమణశాయీ భూరిసౌఖ్యప్రదాయీ
గజవరపరిపాలా కాంచనోదారచేలా
సుజనహృదయఖేలా సోమసౌందర్యఫాలా

**Colophon:**

ఇది శ్రీమద్రఘురామచరణారవిందవందనసమాసాదిత కవితాధారేయ, అత్తోటకులసాగరాత్రేయ రఘుపతిరాయామాత్యప్రణీతంబైన రఘుపతిరాయవ్యంబను వేదాంతకావ్యంబునందు కృత్యాదియును, గురుపరిచర్యావిధానఘట్టంబును గురుకృపాలబ్ధిఘట్టంబును, అసద్గురువ్యాపారలక్షణఘట్టంబును, గురుబోధాలోచనఘట్టంబును బోధార్థప్రమేయఘట్టంబును గురుబోధారంభఘట్టంబును . . .
అనన్యశరణ్య భక్తజనప్రచారఘట్టంబు నను నిరువదియారు ఘట్టంబులతోడంగూడి యీ ప్రథమాశ్వాసము ప్రకాశించెడిని.

(వి-వి)—

అసమగ్రము ప్రథమాశ్వాసము మాత్రము గలదు. వ్రాంత చక్కనిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు

రఘుపతిరాయవ్యమని పేరుగల యీ వేదాంతగ్రంథమత్తోట

వివరణముగూడఁగలదు ఒకటియాశ్వాసమాత్రమేయుండుటచే స్పష్టము గాఁజెప్పఁ గుదురదుగాని యిది యద్వైతవేదాంతమును నిరూపించునది గాఁ గానవచ్చుచున్నది గ్రంథకర్త ఆపస్తంబసూత్రుఁడు అతని వంశ వృక్షమిది




* గ్రంథకర్త విజయనగర మహారాజగు విజయరామ రాజు కాలమున నారాజ్యమున ‘సమల్ దార్’ పనిచేసినాఁడు అతని గురువులను గూర్చి యుదాహృత పద్యములఁ జూచునది ఈ గ్రంథము శ్రీరామ దేవున కర్పితము.

---

## R No 725

Paper 10 × 9¾ inches Foll 68 Lines, 20 in a page. Mode of writing, good but not free from mistakes Good

Transcribed in 1920–21 from a MS of M R Ry Kotikalapūdi Yajñēsagāri Narasimhasiddhântigaru, Bobbili

Foll 66*b*—68*b* are left blank

నక్షత్రవివరణము.

NAKSATRAVIVARANAMU

An astrological treatise in Telugu, narrating the nature and characteristics of the 27 Naksatras (constellations) The work also contains some Sanskrit verses and is written after consulting a number of works such as the Sūryasiddhânta, Siddhântasirōmani, etc

Incomplete

**Beginning**

శ్లో॰ రాకాసుధాంశుద్యుతిమచ్ఛరీరాం
రాజీవగర్భాననసౌధసంస్థామ్।
రామామణిం రంజితభక్తలోకాం
నమామి దేవీం నతదేవదేవీమ్

శ్లో॰ కోటికలపూండికులీనః
కోదండరామాహ్వయో మహీవిబుధః ।
నక్షత్రవివరణాఖ్యం
వక్ష్యే గ్రంథం హితాయ లోకానామ్ ॥

శ్లో॰. స్కంధత్రితయే యద్య
త్కథితం మయయవనశక్తిముఖపూర్వైః ।
నక్షత్రవిషయ మఖిలం
తత్తత్సర్వం వివృణ్మహే బుద్ధ్యా ॥

శ్రీసూర్యసిద్ధాంతమతమును అవలంబించి సోమసిద్ధాంత బ్రహ్మసిద్ధాంతార్యభటసిద్ధాంత గౌరీసిద్ధాంత సిద్ధాంతశిరోమణి ప్రముఖ గ్రంథంబులయందు చెప్పబడ్డ తదవిరోధవాక్యములను నిలుపుకొని శ్రీకూర్మక్షేత్రానకు పశ్చిమంగా సమీపమందువున్న బొబ్బిలి పట్టణానకు విశేషోపయోగంగా ధనాయనాంశలు ౨౧ ।౦ ।౦ అయివర్ధిల్లుతూ ఉన్న సమయమందు, కోటికలపూండి కోదండరామయ్య అనే వక బ్రాహ్మణుడు ఈ గ్రంథమును ఆంధ్రగీర్వాణభాషలచేత రచిస్తూఉన్నాడు

**End**

శ్లో॰ కృత్తికాదీని ఋక్షాణి గణ్యంతే సప్తభాగినః।
సింధుం క్రోడం గిరిం కక్షం కూల మక్షం చ పర్వతాన్ ॥

ఫలమ్—

పర్వతేషు త్వనావృష్టి స్సువృష్టిః కక్షక్రోడయోః ।
కూలేషు చిత్రవృష్టిస్స్యాదతివృష్టిస్సముద్రగా ॥

రోగారికి నక్షత్రపాదభేదాలు—

అశ్విని. ౯ । ౧౦ । ౯ । ౧౦
భరణి - ౧౯ । ౧౪ । ౧౨ । ౨౦.

ఇత్యాది.

(వి-వి)—

అసమగ్రము. కడపట కొంచెము కొఱతయయి యుండును. వ్రాఁత చక్కనిది తప్పులున్నవి శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు

నక్షత్ర వివరణమని పేరుగల యీ జ్యోతిష గ్రంథమున సూర్యసిద్ధాంతము ననుసరించి తక్కిన సిద్ధాంతములందును సిద్ధాంత శిరోమణ్యాదులందును ఇంకను జాతక ముహూర్త సద్గ్రంథములందును, నక్షత్రములనుగూర్చి కల విషయము లెల్ల సంగ్రహింపఁబడినవి. చక్కచక్కని కారికారూపముగా సంస్కృత శ్లోకములు గలవు పదకములు పెక్కులు గలవు.

---

R No 7?6.

Paper 10⅜ × 9⅜ inches Foll 70 Lines, 20 in a page Mode of writing, first vol good and free from mistakes, second vol not good and full of mistakes Good

Restored in 1920–21 from a MS of the Government Oriental MSS Library, Madras

Foll 17*b*—18, 69 and 70 are left blank

Bound in two volumes

హరవిలాసము.

HARAVILĀSAMU

Same work as that described under R No 104 ante, from which the MS under notice was restored

Incomplete

(వి-వి)—

అసమగ్రము. ఆదినుండి దారుకారణ్యవిహారకథవఱకుఁ గలదు. రెండు సంపుటములుగా నున్నది ఒక సంపుటమున వ్రాఁత మంచిది. రెండవ సంపుటము వ్రాఁత మంచిదిగాదు. రెండవ సంపుటము తప్పుల మయము

ఇది ఆర్ నె 104 రున వరితమెనదే గాని [illegible]

## R No 737

Paper 10⅜ × 9⅜ inches Foll 28 Lines 20 in a page Mode of writing, bad, full of mistakes and breaks off in some places Good

Transcribed in 1920–21 from a MS of M R Ry Kotikalapūdi Yajñēśvaragāru Narasimhasiddhantigāru Bobbili

Foll 27b–28b are left blank

ఆర్యభటీయటీక.

ĀRYABHAṬĪYAṬĪKA

Same work as that described under R No 621 ante, which is a portion of the work under notice

Incomplete

**Beginning:**

శ్లో శ్రీరామం రణజితభృగు
రామం యోగీంద్రమానసారామమ్ ।
జగదభిరామం దైత్యవి
రామం రామం నమామి సద్భక్త్యా ॥

* * *

శ్లో కోటికలపూడికులీనో
బొబ్బిలిపురసంస్థితో హరితగోత్రః ।
కోదండరామసుకవిః
కరోతి టీకాం తృతీయపాదస్య ॥

శ్లో. సూత్రార్థం గణితోదా
హరణం గోళద్వయోపపత్తిం చ ।
అనతిక్రమ్యార్యభట
వ్యాశయ మాంధ్రోక్తిభిః కరిష్యేఽహమ్॥

ఈ భూ(భాగము) గోళములయందు దేశకాలభేదములవల్ల వచ్చే నానావిధ ఫలభేదములను తెలుపుడు చేసేది గనుక గోళపాదమనిపించుకుంటుంది. సువర్ణమయ కటాహద్వయసంపుటీకృతానంతయోజనవ్యాసాన్వితఘనగోళాకారమైన బ్రహ్మాండంయొక్క లోపల ఉన్న ఆకాశంపేరు క్షేత్రమనిపించుకుంటుంది ఈ ఆకాశంయొక్క విభాగం క్షేత్రగణితములచే సాధ్యం కాబట్టి క్షేత్రమని అనఁబడెను ఈ క్షేత్రముయొక్క మధ్యభాగమందు పంచభూతమయమై జలకటాహోర్ధ్వస్థలకటాహోర్ధ్వసం

గృహ! యోజనములయొక్క వ్యాసం కలదై సర్వేశ్వరునియొక్క ధార ణాశక్తి అయ్యేవే ఆధారంగాకలదై అరవైఘడియలకు ఒక పర్యాయం చొప్పున అనవరత ప్రాగ్భ్రమణం కలదై భూగోళం ఉన్నది

**End**

ముప్పైవొక్క సూత్రంచేతను మధ్యాహ్నశంకును చెబుతున్నాడు.

శ్లో. క్షితిజాదున్నతభాగా
నాం యా జ్యా సా పరో భవేచ్ఛయః ।
మధ్యాహ్నతః భాగజ్యా
ఛాయా శంకోశ్చ తస్యైవ ॥

స్వదేశక్షితిజకక్షయొక్క దక్షిణోత్తర కక్షమీఁదికి మధ్యాహ్నకాల మందు సూర్యుడు వస్తాడుగనుక ఆరోజు అంతకంటె ఉన్నతమైన శంకు ఉండకపోబట్టి అది గొప్పశంకు అనిపించుకుంటుంది ఆ శంకు ప్రమా ణం యెట్లా వస్తుందంటె

ఇది ఏకత్రింశత్సూత్రం

(వి-వి)—

అసమగ్రము వ్రాఁత మంచిదిగాదు తప్పుల కప్ప శైథిల్యము లేదుగాని మాతృకలోఁగొన్ని పత్రములు కొఱఁతగానుండుటచే నడుమ నడుమ గ్రంథపాతములు గలవు

ఆర్యభటసిద్ధాంతమందలి గోళపాదమునకిది తెలుఁగుటీక కొటి కలపూఁడి కోదండరామ సిద్ధాంతి దీని రచియించెను ఈ గ్రంథమందలి దేయగు కాలక్రియాపాదమునకుటీక ఆర్ నె 587 రున గలదు ఆర్. నె 524 రు కూడ నేతద్గ్రంథైకదేశమే.

---

## R No 738

Palm-leaf 18 × 1½ inches Foll 6 Lines, 6 in a page Mode of writing, good, contains mistakes and breaks off in some places Injured

Presented in 1920–21 by M R Ry. Dūpagunda Akṣaya Lingamagāru, Tāṭikonda, Guntur district

వేంకటేశశతకము.

VĒNKATĒŚAŚATAKAMU

A centum of anthological stanzas in the Kanda metre, addressed to god Vēnkatēśa worshipped in the sacred shrine at Tirupati

**Beginning.**

క. శ్రీమానినీమనోహాంక
చామీకరదివ్యవసనసనకాదిముని
స్తోమనుతనామసద్గుణ
ధామా శ్రీవేంకటేశ దైన్యవినాశా!

**End.**

క పరులకు . చు
పరసంపదఁ జూచిమిగుల బ్రమదముతోడఁ
బరగినవారిఁ డిమ్మహిని
తప్పరు . . .
క పరులహితముఁ జేయఁ జూడక
నిరతము . . .

(వి-వి.)—

అసమగ్రము ౭౮ పద్యములు మాత్రమున్నవి వ్రాఁత మంచిది. శైథిల్యము, గ్రంథపాతములు గలవు

స్తుతి, నీతి విషయములుగల యీ వేంకటేశశతమునకుఁ గర్తయెవరో తెలియరాదు

---

## R. No 739

Palm-leaf $13\frac{1}{2} \times 1\frac{1}{4}$ inches Foll 19 Lines, 6 in a page Mode of writing, good, not free from mistakes and breaks off in some places. Good

Presented in 1920–21 by M R Ry. Dūpagunda Aksaya Lingama gāru, Tātikonda, Guntur district

కుచేలోపాఖ్యానము

KUCĒLŌPĀKHYĀNAMU.

A Prabandha narrating the story of Kucēla (co-pupil with Lord Krsna) who, having been afflicted with great poverty, approached Lord Kṛṣṇa and became prosperous Apparently by Gattuprabhu

Incomplete

**Beginning**

క॥ శ్రీమద్భాగవతార్థ
ప్రామంబులు దెలుప నెడల శుకయోగీంద్రుఁ
డా మోదమునఁ బరీక్షి
ద్భూమీశునకనియె వాక్ప్రౌ నట

**End**

ఆరయ నాడంబరాణి పూజ్యాని యనుచుఁ
జాటుచుండెడు నీతిశాస్త్రంబు నిజము

(వి-వి)—

అసమగ్రము అవతరణిక లేదు అవసానము లేదు వ్రాఁత మంచిది తప్పు లంతగా లేవు శైథిల్యము గలదు గ్రంథపాతము అల్పముగాఁ గలదు

అవతరణిక, ఆశ్వాసాంతగద్యము, మొదలగునవి లేవుగాన కర్తపే రెఱుఁగరాదు గట్టు ప్రభు వయియుండవచ్చును. శ్రీకృష్ణుని సతీర్థ్యుఁడగు కుచేలునిచరిత్ర మీఁదు వర్ణింపఁబడినది.

---

R. No. 740.

Palm leaf 16 × 1½ inches Foll. 18 Lines, 5 in a page Mode of writing, not bad, not free from mistakes and breaks off in many places. Injured

Presented in 1920–21 by M. R. Ry. M. Pērayyagāru, Ivani, Peddavadlapūdi, Tenali taluk

గణేశచరిత్రము.

GANĒSACARITRAMU

A Prabandha in three Āsvāsas narrating the story of god Ganēśa by Subrahmanyakavi of Mēdavaram who belonged to Kāmakāyana-Visvāmitragōtra. For other particulars see the extracts given below.

Complete

**Beginning**

ఉ॥ శ్రీరఘువంశవారినిధిశీతమయూఖ దయాలవాల పం
కేరుహపత్త్రనేత్ర సురగేయచరిత్ర ధరాత్మజామన
స్సారసమిత్ర వారిధరచారుశరీర సురాద్రిధీర యం
భోరుహసంభవాదిసురపూజిత రామనృపాలశేఖరా

* * *

క పున్నమరాజు సువంశో
త్పన్నుఁడు రామన్న నాకుఁ బ్రాణసఖుండై
యెన్నఁడు గృతిగాంక్షించిన
మన్నామం బందు నిల్పుమనె నను భక్తిన్.

క మును వాల్మీకుని వ్యాసుని
ఘనుఁడగు శ్రీకాళిదాసకవి నన్నయభ
ట్టును వేడవరపు హేమా
ద్రిని సర్వకవిందలంతుఁ దేజమెలర్పన్.

* * * *

క. శివపూజాసక్తుఁడు వే
డవరపువంశాబ్ధిశీతధాముఁడు ధరణీ
దివిజానందకరుండై
భువిలో బ్రహ్మన్న వెలసె బుధవందితుఁడై.

గీ. ఆమహాత్ముఁడు గనెను లింగాంబయందు
ఘనచరితలను గామాంబగంగమయను
పుత్త్రిలను గీర్తిమంతులఁ బుణ్యయుతులఁ
బంతులును గురునాథుఁ డన్ భవ్యమతుల.

గీ అగ్రజుండైన పంతు లుదగ్రకీర్తి

* * * *

క. సుతులనుగనెఁ గవిబుధస
న్నుతచారిత్రులను భానుతుల్యద్యుతులన్
సతతమహేశ్వరపూజా
రతులను గౌతమమునీశ్వరాహ్వయుని ననున్.

క. ధరలో సుబ్రహ్మణ్యే
శ్వరుఁ డనునే విష్ణురాజచరితము వేడ్కన్
విరచించి రెండవదియా
వరకృతి యర్పింతు రామవసుధేశునకున్

* * * *

వ సమాప్తంబుగా నారచియింపంబూనిన విష్ణురాజచరిత్రంబను ప్రబంధంబునకు.

**End**

మ. ధరణింగన్గొన శాలివాహనశకాబ్దంబుల్ కరాబ్ధ్యశ్వముల్
స్మరస . పణ సాధారణాబ్దాశ్వయు
గ్వరశుద్ధాష్టమినా సువాసరమునన్ గంజాక్ష . సుం
దరు మానూరికులాబ్ధిశీతకరుడా వాసన్నృప్రభో

**Colophon .**

. . కరుణాకటాక్షలబ్ధకవిత్వ కామకాయనసవిశ్వా
మిత్రగోత్రపవిత్ర మేడపరపు బ్రహ్మార్యపౌత్ర పంతులునామ
సుబ్రహ్మణ్యేశ్వర ప్రణీతంబైన విష్ణురాజచరిత్రంబను
ప్రబంధంబునందు సర్వంబను ద్వితీయాశ్వాసము

(వి-వి)—

సమగ్రము వ్రాంత యొకమాదిరిగానున్నది తప్పు లంతగా లేవు
శైథిల్యము గ్రంథపాతములు మికిలి గలవు

విష్ణ్వీశ్వరుని చరిత్రమిందు వర్ణింపబడినది గ్రంథకర్త మేడవరపు
సుబ్రహ్మణ్యేశ్వరకవి కామకాయనసవిశ్వామిత్రగోత్రుడు పంతులు
కొడుకు. విశేషముల కుదాహృత పద్యములు జూచునది

---

## R No 741.

Palm-leaf 16¾ × 1¼ inches Foll 47 Lines, 5 in a page Mode of writing, good and free from mistakes. Injured and wants many leaves in the middle

Presented in 1921-22 by M R Ry Kanuparti Mārkandēya Śarmagāru, Brndāvanam, Kilpauk, Madras

ద్విపదభారతము

### DVIPADABHĀRATAMU

A Prabandha in Dvipada metre narrating the story of the Mahābhārata by Timmaya, son of Vallabhasūri It is supposed that Tirumalabhatta of Bhattipādu is the same as Timmaya, the author of the work under notice As the MS is very much injured and as it contains neither the beginning nor the end it is not possible to give further details about him

Contains the Āśvāsas 2 and 3 only

**Beginning**

శ్రీకరశుభనామ శ్రితజనస్తోమ
సాకేతపురధామ సంగ్రామభీమ
రహిఁ జెలంగఁగఁ గవిరాజును బ్రోచి
మహిమ దీపించు రామా చిత్తగింపు
వవలక మూఁడుపర్వములైన వెనుక
చదురొప్పనవియె వైశంపాయనునకు
చను దెంచి పండ్రెండు సంవత్సరములు
వనవాసముననుండి వరుసఁ బాండవులు.

**Colophon**

జానకీహృదయకంజాతమార్తాండ
దానవపతిగర్వదళితోరుకాండ
* * *
ఇది సదాహరిభక్తహితగుణాసక్త
సదయస్వరూప కాశ్యపగోత్రదీప
శ్రుతిపాత్ర వల్లభ సూరిసత్పుత్త్ర
మతిమద్విధేయ తిమ్మయనామధేయ
రచిత విరాటపర్వమున నాశ్వాస
ముచితార్థయుతముగా నొప్పె రెండవది.

(వి-వి)—

అసమగ్రము. అనేక పత్రములు పోయినవి. ఉన్నవికూడ వరుస గా లేవు వ్రాఁత తిన్ననిది. తప్పు లంతగా లేవు శైథిల్యము గలదు గ్రంథపాతములు కడు హెచ్చు

ఈ ద్విపద విరాటపర్వము, వల్లభసూరి కుమారుఁడయిన తిమ్మయ రచియించినది. గ్రంథభాగము అనుపూర్వితో లేక తునుకలు తునుకలు గా నున్నది గాన విశేషములు తెలియరాకున్నవి ఇకరీడనున్న గ్రంథభాగమున 2, 3 ఆశ్వాసములు ముగింపులున్నవి. ఇది శ్రీరామాంకితము. ఇట్టేపాటి తిరుమలభట్టీతఁడే.

---

## R No 742.

Paper 10¾ × 9¾ inches Foll 104 Lines, 20 in a page Mode of writing, fair but contains mistakes Good

Transcribed in 1920–21 from a MS of M R Ry Venkatanrsimha

సీతావిజయము

SĪTĀVIJAYAMU

Slightly different from the work described under R No 625 ante Though the stanzas are the same as those contained in the work described under R No 625 ante, the prose versions are altogether different This MS contains the introductory portion and is by Lingakavi, while the other is by Mardayakavi This MS states that the work is dedicated to Bhōgama Reddi, while it is stated in the other MS that the work has been dedicated to Pōcama Reddi There is however sufficient reason to state that the dedicatee was Pōcama Reddi and not Bhōgama Reddi

Complete

**Beginning**

ఉ. శ్రీవనితాలలామమును శిష్టజనస్తుతశీలయైన భూ
దేవతపాదపద్మము లతిప్రియ మెగ్గడ నొత్తశేషమూ
ర్ధావళిఁగల్గు రత్ననివహద్యుతియంగములన్ వెలుంగునా
త్మావిభుఁడాదరించి యతిసౌఖ్యపరంపరమిఱఁ బ్రోవుతన్.

* * * *

వ. గొబ్బూరి వంశసుధాంబోధి హిమకరుండును
పొమ్మూరి పట్టణాధ్యక్షుండును నగు భోగన్నపాలుం డీకృతికి
నధిపతిగాఁదగునని యంటి

* * * *

చ. ఎల సతిలింగసత్కవి సురేంద్రఫణీంద్రవచోవిలాస నీ
పలుకులు తాండవేశ్వరకపర్దలురద్గగనాపగాచల
చ్చలదురుయంత్రరంగచయసంకషజాతనిరర్గళాతివి
ర్మల విలసత్ప్రతి మాముఖ(?)సమానవిజృంభణముల్ దలంపఁగన్.

**End:**

ఉ శ్రీరమణీయవైభవ విశిష్టగుణాకరదీనలోకమం
దారగభీరధీరసముదారసుకీర్తివిహారశత్రుసం
హారయఘప్రహారణదయాసుశరీరసుధాకర ప్రభా
కారలసద్విచారజయకారణ భోగయరెడ్డిభూవరా !

**Colophon**

ఇది శ్రీమద్వేదాద్రిపురనివాస శ్రీరంగచరణసరసీరుహభ్రమరా
యమాణ పాచ్చాలగోత్రపవిత్ర చిన్నారెడ్డి పుత్త్రి భోగన్నపాల నిజా
శ్రితలింగ సుకవి ప్రణీతంబైన సీతావిజయంబను మహాప్రబంధంబునందు

(వి-వి)—

సముగ్రము. వ్రాఁత యొకమాదిరిగా నున్నది తప్పు లున్నవి. శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

ఆర్ నె 625 రున వర్ణితమగు గ్రంథము నిదియు నొకటియే కాని, దానిగద్యము దీనిగద్యము వేర్వేరుగా నున్నవి ఇందు గ్రంథావతరణిక గలదు అందు లేదు ఇందు గ్రంథకర్త లింగ యని కలదు అందు మర్దయకవి యని కలదు మరియు నాశ్వాసాద్యంత పద్యములు రెండింటి నొకవిధముననే కలవు గాని, కృతిపతి పేరిందు బోగమరెడ్డి యనియు నందు పోచమరెడ్డియనియుఁ గలదు తృతీయాశ్వాసము మొదటనున్న యీక్రింది పద్యమును బట్టి కృతిపతి పేరు పోచయ యగుటయే సరియునదగి యున్నది.

గీ. శ్రీకరాకార రాజ్యలక్ష్మీవిహార
హారగోక్షీర హారనీహారతార
తారచయతుషారభూధరగంధసార
సారకీర్తివిశాల పోచయన్నపాల

ఇందు 'భోగయ' యను పాఠమున యతి తప్పును కాఁబట్టి యీ ప్రతిలోని యవతరణికయు, కృతిపతియుఁ గల్పితులని తెలుచున్నది

ఆర్ నె 70 రున వర్ణితమగు సీతావిజయము వేఱొకటి

---

## R No 743.

Palm-leaf 15¾ × 1⅙ inches Foll 109 Lines, 6 in a page Mode of writing not good Full of mistakes and breaks off in many places. Slightly injured

Presented in 1920–21 by M R Ry Kanuparti Markandeya Sarma-gāru, Brndāvanam, Kilpauk, Madras

కృష్ణవిలాసము

KRSNAVĪLASAMU

A Prabandha in three Āsvasas narrating the story of the ten incarnations of Lord Nārāyana The author Vēnkatanrsimhacārya of Mariganti family was the son of Kumāravēnkatacārya who was the son of Vēnkatadēsika

Contains the story of Nrsimha, Rāma and Krsna only

**Beginning**

ఉ. శ్రీమహిళాకుచస్తబకచిత్రితకుంకుమచందనాంకిత
స్తోమసుసౌరభంబులకు జొక్కెడు శేషనగేంద్రవైఖరుల్
వేమరుఁ జూపుచున్నపుడు వేడ్కతొ శిక్షనగండ్లగహ్వరీ
ధాముఁడునౌ నృసింహుఁడు ముదమ్మున మమ్ములఁ బ్రోవుఁగావుత౯.

**End:**

మాలిని.

ఖహిపతిసఖిప్రేమా మానిచిత్తాభిరామా
అహివరనగధామా హాటకద్వర్ణక్షౌమా ।
కుహనదనుజభీమా కుంజరార్తివిరామా
ద్రుహిణజనుతనామా దేవతాసార్వభౌమా

**Colophon**

ఇది శ్రీమద్వేంకటలక్ష్మీనృసింహవరప్రసాదలబ్ధకవితావిచిత్ర మౌద్గల్యసగోత్ర పవిత్ర వెంకటదేశికపౌత్త్ర కుమారవేంకటాచార్యపుత్త్ర మరింగంటి వెంకటనృసింహాచార్య విరచితంబైన శ్రీకృష్ణవిలాసంబను మహాప్రబంధంబునందు సర్వంబును తృతీయాశ్వాసము

(వి-వి)—

సమగ్రము వ్రాఁత మంచిదికాదు తప్పు లెక్కువ. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

ఇందు ఆదినారాయణుని యవతారకథలు, అందును నృసింహరామకృష్ణావతారకథలు వర్ణితములయినవి గ్రంథకర్త మరింగంటి వెంకటనృసింహాచార్యుండు కుమారవేంకటాచార్య పుత్త్రుడు.

---

R No 744

Palm-leaf 17½ × 1½ inches Fol 10 Lines, 5 in a page Mode of writing, good, contains mistakes and breaks off in some places Injured

Presented in 1920-21 by M R Ry Kottapalli Hanumayyagāru, Gurazala

గేయములు

GĒYAMULU

A collection of songs relating to the Śrī-Vaisnava religion
Complete

**Beginning**

కస్తూరిరంగేశ కారుణ్యపరా
కావేరీస్థలవాస కరుణాకటాక్ష ! లాలీ

**End**

చెప్పవమ్మ యిందువృష్ఠ సిద్ధపర్మమూ, అకలయ్య
అప్పబూకూరిస్వామికదిమె చెప్పవే
విదితమంత్రరాజ మోక్షవిద్యయెట్టిదే అకలయ్య
సుదతిరో ద్వయప్రపత్తి సులభమార్గము

*　　*　　*　　*

తగినప్రాప్తియుల విరోధితత్త్వమెట్టిదే, అకలయ్య
మగువ అభిజనాద్యహంమమత గుణములు

*　　*　　*　　*

ఇన్నిపదార్థములు నీవు ఎట్టుగంటివే, అకలయ్య
తెన్నరంగం పొన్నాడన్ని తెల్పిరి
కన్నతల్లివారి నన్ను గలయగూర్పవే, అకలయ్య
అన్నికళలుపరాకస్తువందు బొందుచూ, చెప్పవమ్మ

(వి-వి) —

సమగ్రము. వ్రాంత మంచిది తప్పులున్నవి శైథిల్యగ్రంథపాత ములు గలవు.

శ్రీవైష్ణవమత ప్రసక్తములగు గేయములు కొన్నియిందుఁ గలవు

---

## R. No 745.

Palm leaf 17½ × 1¼ inches Foll 136 Lines, 6 in a page Mode of writing, good, full of mistakes and breaks off in many places Injured

Presented in 1920-21 by M R Ry Dūpagunda Aksaya Lingayyagāru, Tatikonda, Guntur district.

బ్రహ్మోత్తరఖండము

BRAHMOTTARAKHANDAMU

Foll 1*a*—106*b*

Similar to the work described under Nos 31, 33 and 34, of the D C Tel MSS, Vol I By Meluga Linganārya, a devotee of Vīrabhadrasvāmin The work has been dedicated to Śrīkalahastīśvara For other particulars see the extracts given below

Complete

**Beginning :**

సీ. సారతరాగమశాఖాంతరాళసం
భావ్యప్రభావ విభాసమాన
శ్రితసుమనోరస శ్రీనిధానానంత
సురభిచరిత్ర సంశోభమాన
సంతతద్విజకోటి సంప్రార్థ్యమానది
వ్యాచ్యుతఫలవిధానాసమాన
సంయుతపవమాన చాతురీషట్పద
రాజీవసద్వర్గ రాజమాన
యగుచు నలరారు శ్రీకాళహస్తిశివుని
యుత్తమాంగంబుఁ బాయక యుండుహిమధ
రాధరాంగసంజాత విభ్రాజమాన
శుభము లీవుత జ్ఞానప్రసూనకళిక '

* * *

ఉ సన్నిధిశ్రీగిరీశ్వరుఁ బ్రసన్నునిఁజేయుచు నాత్మనాకుసం
పన్నతనూడఁగా వరము ప్రార్థనగన్న మొఱంగువంశసం
పన్నిధి పాదపద్మ వినమన్నిధి మాపెదచెన్నమయ్యగా
రి న్నిఖిలాంగకంబులు ధరిత్రిని మోపి నమస్కరించెదన్

* * * *

**End**

మ. అనుచున్ సూతుఁడు శౌనకాదిమునులాహ్లాదంబుఁ బొందన్వచిం
చినబ్రహ్మోత్తరఖండసత్కథలు రంజిల్లంగ నాంధ్రప్రబం
ధనిరూఢిన్ భగవదంకితంబుగ సురేంద్రస్తుత్య ! నేఁజేసితిన్
వినుమా రాజశిఖామణీ సదయతన్ శ్రీకాళహస్తీశ్వరా

మయూరదము

గంధగజదైత్యఘనగంధవహ తేజా
కంధరసమానరుచి కంధరవిభాగా
అంధకమహాసురమదాంధతమసార్కా

**Colophon**

ఇది శ్రీ యెనమదల వీరభద్రప్రసాద సంవర్ధిత మొలుంగు వెంకటపతి త్ర కౌండిన్యసగోత్ర పవిత్ర కసువాచార్య పౌత్ర గురవారాధ్య పుత్త్ర లింగనార్య ప్రణీతంబైన శ్రీసోమవ్రతకఖండంబగుకావ్యము సర్వంబును పంచమాశ్వాసము సంపూర్ణము

(వి-వి)—

సమగ్రము ప్రాంతమంచిది తప్పు లెక్కువ. శైథిల్యము మిక్కిలి గ్రంథపాతములు గలవు

ఇది డీ॥ 31, 33, 34, నెం వర్ణితములగు గ్రంథములవంటిదే. కర్త వేఱు మొలుఁగు లింగనార్యుఁడు దీని రచించెను ఈతఁడు గుంటూరు మండలమందలి యెనమదలలో వెలసిన వీరభద్రస్వామికి భక్తుఁడు ఈ కృతి నీతఁడు కాళహస్తీశ్వరున కర్పించెను విశేషముల కుదాహృత గ్రంథభాగము చూచునది

---

(*b*) సోమవారవ్రత మహాత్త్వము.

SŌMAVĀRAVRATA MAHATTVAMU

Foll 107*a*—136*b*

A Prabandha bringing out the importance of observing the Sōmavāravrata The author Nāgabhūsanakavi of Tummulapalli family was an inhabitant of Gudivāda

Complete in one Āsvasa

**Beginning**

ఉ. శ్రీపరమేశుపాదములు చిత్తములోనఁ దలంచి . .
పాపవిదూర కాహ్వయుని భక్తజనాశ్రయు భర్గునీశ్వరున్
భూపతి సార్వభౌము సురపూజితు బాలశశాంకశేఖరున్
శ్రీపతిసేవితున్ విమలచిత్తు యశోనిధి ఫాలనేత్రునిన్.

* * * *

గీ. ఆంధ్రదేశంబునందున నమరియున్న
ప్రాభవంబైన గుడివాడ పట్టణమున
ప్రకటితంబైన తుమ్మలపల్లివంశ
సంభవుండను నాగభూషణుఁడ నేను.

**Colophon**

ఇది శ్రీపార్వతీ పరమేశ్వర వరప్రసాదలబ్ధ సకలమండిత సుకవి జనసమ్మత వివమాహేశ్వరాచార పట్టకట్టాగకవ్య త్రిపురాంతకవరపుత్త్రి నాగభూషణ నామధేయప్రణీతంబైన సోమవారమహాత్మ్యంబను మహాప్రబంధంబునందు కదాచిన్నాంతంబు పద్యకావ్యంబు సర్వంబును నేకాశ్వాసమయ్యె

(వి-వి)—

సమగ్రము. వ్రాత చక్కనిది తప్పు లున్నవి శైథిల్యము, గ్రంథపాతములు గలవు

శైవులు ముఖ్యముగా నాచరించెడు సోమవారవ్రతము మాహాత్మ్య మిందు వర్ణింపబడినది గ్రంథకర్త తుమ్మలపల్లి నాగభూషణకవి

---

## R No 745

Palm leaf 9 × 1½ inches Foll 42 Lines, 6 in a page Mode of writing fair Contains mistakes and breaks off in some places Slightly injured

Presented in 1920–21 by M R Ry M Peraiyagaru, Inam Peddavadlapūdi Railway station Tenali taluk, Guntur district

తత్త్వములు

TATTVAMULU

A collection of songs relating to philosophical topics
Complete

**Beginning**

కనలేరుమహీజనుల్ కలియుగంబునను
ఘనులైనవారికే కన్పడుంగాక
యితరాదులకునెల్ల నెకకన్పడును
పుడమిమానవులకుఁ బూర్వపుణ్యంబు

**End.**

వినరయ్యమీరూ వినరయ్యా
వినరయ్యపరులార విశదముగానూ
పరిపూర్ణపరతత్త్వ ఫలముచెప్పెదనూ
వేదాదిశాస్త్రములు వెదకిచూడండి
ఇదుగో కైవల్యము ఎరుకతోరండి

(వి-వి.)—

సమగ్రము. వ్రాత యొకతీరుగానున్నది తప్పులున్నవి శైథిల్యము గ్రంథపాతములు ఇట్టివిగాని లేవు

వేదాంత విషయములు చెప్పుచున్నగేయములు ఇందు గలవు అవి యొ కర్తృక రచించినవి గావు

---

## R No 746

Palm-leaf 18¾ × 1½ inches Foll 152 Lines 6 on a page Mode of writing good and free from mistakes Breaks off here and there Much injured

Presented in 1921–22 by M R Ry Bezwada Ramachandra Reddi Garu, Buchireddipalem Nellore district

శేషధర్మములు

ŚĒSADHARMAMULU

Same work as that described under R No 725 *ante*, which was copied from the MS under notice by Siddharaju

Complete

At the end there is a portion of Brahmōttarakhanda by Pratakōta Pullaya

(వి-వి.)—

సమగ్రము వ్రాత మంచిది తప్పు లంతగా లేవు. శైథిల్యము మిక్కిలి కలదు. గ్రంథపాతములు గలవు.

ఇది ఆర్. నె 725 రున వర్ణితమయినదానికి మాతృక. ప్రాంతకోట పుల్లయ రచియించిన బ్రహ్మోత్తరఖండ భాగముగూడ నిందుc గలదు. అదియు మిక్కిలి శిథిలమగుటచేతను బెక్కుప్రతులు దానికి పుస్తకశాల లోనుండుటచేతను, వేఱుగా దానిc బేర్కొనలేదు.

---

## R No 747

Paper 10¾ × 9¾ inches Foll 25 Lines, 20 in a page Mode of writing, good Full of mistakes Good

Transcribed in 1922–23 from a MS of M R Ry Chakrula Rāmaraju, Pallakona, Repalle taluk, Guntur district

చాటువిషయములు

CĀTUVISAYAMULU

Similar to the work described under R No 233 (e) *ante*

Complete

Contains stanzas in praise of one Vēmareddi and also some of the stanzas of Gōpalasataka, Gōpīvastrapaharana Bhrngapadēsa, etc

**Beginning:**

గుమ్మడేడే గోపిదేవి గుమ్మడేడే అమ్మతల్లి
గుమ్మనిటుచూపగదె మాయమ్మ గోపెమ్మా గుమ్మడేడే

**End.**

చ అతులసభాంతర స్థితబుధావళి కెల్ల జోహారు వీరరా
వాలుతులక దే జోహారు పగసంతతపు(సతతో)జ్జ్వలులైత గుసార్వబౌమ
సంతతికి నిదే జోహారులును సౌరభవిలాసపురందరుడైన యట్టి భూ
పతికి జోహారుమాన పరిపాల జోహారు ప్రధాన శేఖరా!

(వి-వి)—

సమగ్రము వ్రాంత మంచిది తప్పుల కుప్ప శైథిల్యము లెదు. గ్రంథపాతములు లేవు

పాటలు, చాటుపద్యాలు, గోపాలశతకపద్యాలు, గోపీవస్త్రాపహారణపు పాటలు ఇందుగలవు

---

### R No 748.

Palm leaf 17 × 1⅝ inches Foll 66 Lines, 5 on a page Mode of writing, good Free from mistakes and omissions Good

Purchased in 1924–25 from M R Ry K Ramaswami Ayyangar, Retired Headmaster, A V School, Magde, Bangalore district

కన్యకాపురాణము.

KANYAKĀPURĀNAMU.

A Prabandha in Yaksagāna metre narrating the story of a vaisya girl who entered fire, when she was foced to marry the king Visnuvardhana It is stated that this girl appeared again in the form of deity and was worshipped by all the vaisyas

Complete

**Beginning**

క శ్రీశైలకంఠ భూషణు
డాశ్రితజనకల్ప భూజమతులిత మహిమో
ల్లాసియగు కృష్ణమూర్త్యా
దేశికుఁడీమాకునిచ్చు దివ్యవరంబుల్

* * * *

వ అంకితంబుగా నామొనర్పంబూనిన కన్యకాపురాణంబను యక్షగానంబునకు

**End**

సంతోషాతిశయంబున రాజరాజనరేంద్రుండు మితబలసమేతంబుగా నేతెంచి పురవరంబునందు ప్రవేశించి స్వర్ణమయంబైన కొలువుకూటంబునఁ గూరుచుండి విరూపాక్షుండు మొదలుగాఁగల మాటరయేబంద్రు నగరస్వాముల రావించి అనేక స్నేహంబు గావించి అష్టాదశపట్టణంబులకు విరూపాక్షు నభిషిక్తునింజేసి వస్త్రమాల్యాభరణ కర్పూరతాంబూలంబు లందఱికి నొసఁగి తన నిజపట్టణంబునకుం జనియెనని సాలంకాయుడనే యతివరేణ్యుండు వైశ్యమునులకుం జెప్పినవిధంబున

(వి-వి)—

సమగ్రము వ్రాఁతకన్నడమోడిగలది తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పెనుగొండ (కృష్ణామండలము)లో కోమటి కులమునఁ బుట్టిన కన్యకను, విష్ణువర్ధనుఁడను రాజు మోహించి నిర్బంధింపఁగా నామె యగ్నిగుండమునఁ జొచ్చి దేవతయై వెలసిన చారిత్రవిషయ మీయక్షగానమున వర్ణితమయినది దీనికర్త యెవరో యెఱుఁగరాదు.

---

## R No 749

Paper 10¾ × 9¾ inches Foll 50 Lines, 20 in a page Mode of writing, good, Not free from mistakes Good

Transcribed in the year 1924–25 from a MS of Rajah of Venkatagiri, Nellore district

Fol 50 is left blank

తెలుగురాజుల చరిత్రము.

A prose rendering of the Pratapacarita in the dvipada metre attributed to Ekāmranātha The work in question deals with the history of Āndhra kings of Kākatīya family who ruled at Warangal The work Sōmdēvarājīya of Kūcimañci Jaggakavi is supposed to have been based on this work

Complete

**Beginning**

శ్రీమన్మహాదేవుని సర్వదేవతామయుని శంభులింగంబు నారాధించి నాగనాథుని యడుగులకు మ్రొక్కి తదనుమతివడసి యేకామ్రనాథుం డనువాడ నొక్క పుణ్యకథ యుదహరించి చెప్పెద శ్రీశైలోత్తర దేశంబున గోదావరీ మధ్యదేశంబునం దాంధ్రజనపదంబున దండకార ణ్యంబను పుణ్యారణ్యంబునందు సకలమునిజనసేవితంబై హిడింబాశ్ర మంబు విలసిల్లునట్టి పుణ్యాశ్రమంబున కీశాన్యభాగంబునందు హనుమాద్రి యను నొక్క ధరణీధ్రం బొప్పారు

**End .**

ప్రతాపరుద్రుండు ఏకశిలానగరంబు ఏలి విరిచారణ పోయినవెనుక ప్రతాప వీరభద్రయ్య సులతానివశాన యేలిన యేడ్లు 3 ఆవెనక డిల్లీ శ్వరునివశంబు చేసుకొని యేలిన యేండ్లు ౪౮ వారు చాలించుకొని పోయిన తర్వాతను ఓరుగల్లు అంతరమన్నీలు వెమానుములుకు మొద లయినవారు, హానుమకొండ రాజ్యాచేసి యేలిన యేండ్లు ౧౪ తర్వా తను గజపతిరాయలు వెనక రేచర్లవారు రాజ్యముచేసిన యేండ్లు ౫౩. ఆతర్వాతను చితాపఖానుడు ఓరుగంటిలో చెట్టునకికి కించాలు పోయిం చి పయినగట్టించి యేలిన యేండ్లు ౬౪ ఆ వెనుక బెడంద కోటనుండి పీపతుమలకవారు, యేలిన యేండ్లు, ౧౮ అతని కొమారుడుదముసర మలక యేలిన యేండ్లు ౭ తర్వాతను విభ్రరాము కొమారుడు యేలిన యేండ్లు ౬ నెలలు ఇటు యవతలను రుధిరోద్గారి స మ సం॥ పుష్య బ ౫ శనివారంనాడు మహమ్మదు ఖుల్లీపాదుషాహ మహావైభవ దేవేం ద్రుండై యేలుచున్నాడు

(వి-వి )—

సమగ్రము వ్రాంత మంచిది తప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు.

ప్రతాపచరిత్రమను పేర ఏకామ్రనాథుడను కవి రచియించిన ద్విపద గ్రంథమున కిది వచనరూప పరివర్తనమయియుండును ఇందు

ఓరుగంటి కాకతి యాంధ్రరాజుల చరిత్రము వ్రాయబడియున్నది సోమ
దేవరాజీయమను పేర కూచిమంచి జగ్గకవి రచియించిన ప్రబంధముగూడ
నీ గ్రంథము ననుసరించి రచింపబడినది ఇందు గ్రంథకర్త పేరు ప్రతా
ప్రమాదమువలన కలదు—ఇది యెవరి మూల ద్విపద గ్రంథమునుండి యేర్పడి
యుండును లేక యాతడే యీ వచనగ్రంథమునుగూడ జేసియుండ
వచ్చును

---

## R No 750

Palm leaf 14½ × 1½ inches Foll 109 Lines, 6 on a page Mode of writing, fair Breaks off in some places Injured

Purchased in 1924-25 from M R Ry K Ramaswami Ayyangaru, Retired Headmaster A V School, Magadi Bangalore district.

నల చరిత్రము-ద్విపద కావ్యము

NALACARITRAMU-DVIPADA KĀVYAMU

A Prabandha in the dvipada metre narrating the story of Nala—Side R No 145 orth by Rāghavakavi of Chatrapuri

Incomplete

(ఓ-ఓ)—

అసమగ్రము ఆద్యంతములు లేవు నడుమగూడ గ్రంథపాత
ము లెక్కువగాగలవు వ్రాత కన్నడమోడిది శైథిల్యము కలదు

ఇది చక్రపురి రాఘవకవి రచించినది ఆర్ నె 145 దు చూచు
నది

---

## R No 751

Paper 10¾ × 9 inches Foll 161 Lines, 22 in a page Mode of writing good Contains mistakes and breaks off in some places Injured

Presented in 1924-25 by the Raja of Venkatagiri, Nellore district

విష్ణుపురాణము.

VISNUPURĀNA

A Telugu rendering of the Sanskrit work of the same name in six Amsas, written in accordance with the Visistādvaita system The author Appayadīksitārya of Śrīvatsagōtra wrote this work while Kumārayāca bhūpāla was ruling at Venkatagiri

Complete

**Beginning**

శా. శ్రీవైకుంఠపురంబునన్ వెలసి ధాత్రిన్ శేషశైలంబునన్
దేవేంద్రాది సురాళిమనుజసం దృశ్యాభిరామాకృతిన్
సేవింపందగిశ్రీశరారిముఖులెంతేభక్తి గొల్వంగనే
దేవుండొప్పగునప్పరేశుఁగొలుతున్ ధీయుక్తినెల్లప్పుడున్

*     *     *     *

ఉ వాత్స్యజుఁడప్పయార్యుఁడభి వర్ణితశ్రీఫణిభాష్యభాట్టసం
ఖ్యాత్స్యదశేషవిద్వదభి కాంక్షితతర్కనయప్రదుండు భూ
వత్స్యదపారశిష్యజనవర్ధన శోభనవాక్ప్రయుక్తి శ్రీ
మత్స్యముఖావతార పరమంత్రరహస్యవిచార శక్తుఁడున్

క ప్రతివాదిభయంకరగురు
కృతలక్ష్ముఁడు వైష్ణవుండకృత్రిమభగవ
ద్వ్రతధృతి శ్రుతప్రకాశిక
కతిపయ శిష్యులకునొసఁగెఁ గారుణ్యమునన్

క శేషాద్రి ఘనతటిల్లత
యోషామణి వెంకటాంబ యొగిఁగనెసుతున
ద్వేషున్ శ్రీవైష్ణవకుల
భూషున్ధృతసత్యభాషు బుధకృతతోషున్

క. విష్ణుపురాణము భావ మ
వైష్ణవుఁడెఱుఁగఁ డనాది వాసనమష్టిన్
ఉష్ణాంశుఁగనియులూకము
తృష్ణగదిరిదివసమునందుఁ దిరుగంగలదే

సీ. శ్రీభాగవతము మహాభారతంబును
నద్వైతవేష్ములైనట్టివారు
తెలిఁగించిరటగాన తేటపడమహారి
పారమ్య మావిష్ణు భక్తివిధము
శ్రీ పరాశరమునిశిష్టాగ్రగణ్యుండు
విష్ణుపురాణంబు వెలయఁజేసె
అదియుఁగొందఱు యతుల ద్వైతమనితమ
భాష్యంబులోపలవ్రాసికొనిరి
అదియుఁగాదని రామానుజార్యవర్యు
డెట్లు వ్యాఖ్యానమొనరించెనట్లునెగడ

రమణ చెలువొందు విష్ణుపురాణ మొకటి
తెలుఁగుగావించె నప్పయదీక్షితుండు.

* * * *

క. శతమఖముఖకృతినుతికిన్
శతధృతి శితికంఠదేవసంయమి భక్తికిన్
వితతాశ్రితహితరతికిన్
హతదితిసుతతతికి వేంకటాచలపతికిన్

**End:**

క. ఇది విష్ణుపురాణంబున
సదమలమధ్యాయవయము సంగ్రాహ్యంబై
విదితాష్టసంఖ్యమైదాఁ
బొదలుచునష్టదళపద్మమోయన బ్రియమై

శా. అధ్యాయంబులనూఁదియిర్వదిట నాద్యంతంబుల్ జల్పమై
తధ్యాంశంబుల నాఱిటంబెలఁగునే తద్విష్ణునామంబుచే
బోధ్యంబైనపురాణరత్నము మహాపూర్వార్థ సంబాధ్యమై
ప్రధ్యాతాఖిలవిష్ణుసద్గుణ గణప్రార్థ్యంబుచింతింపఁగాన్

* * * *

రథబంధము:

శ్రీలవేఁడెద వెంకటేశ్వర చిత్రకూటాత్తమునించిన
న్నేలు చయ్యనభక్తకల్పమహీజలక్షణ లక్షితా
నీలనీరదరమ్యవిగ్రహ నిత్యసత్యసమన్వితా
కాళియాహిఫణస్ఫురన్మణి కావిభావితసుస్థితా.

ఈ బంధనంమధ్యయందు శ్రీ వేంకటాచల రమణవినుతి యని వున్నది.

మ. ఇదిభూభూషణ భూతవేంకటమహాపృథ్వీధర ప్రాంతపూ
ర్వదిశామధ్యధరాధిపాలనమహారాజాగ్రణీసేవ్యభూ
రిదయాసాంద్రకుమార యాచధరణీభృద్వంద్య శ్రీవైష్ణవా
గ్ర్యదయాధ్యాప్పయదీక్షితార్యకృతిలో రంజిల్లుషష్ఠాంశమై

**Colophon:**

ఇదియును గలియుగ ధర్మంబులు వేదవ్యాసమునీశ్వరుండు కలి యుగంబున స్త్రీశూద్రులును శ్రీ నారాయణ స్మరణయు శ్రేష్ఠమని

సకల మునులకు దెలియజేయుచుండెను సాయంకాలంబుల వర్తనలును జీవునకు గర్భజన్మజరామరణ నరకదుఃఖంబులు తేటపడఁబలుకుటయు భగవద్భక్తుని వ్యసనంబును ఖాండిక్యకేశిధ్వజ సంవాదంబును యోగంబును మోక్షధర్మంబును దెలుపుటయు నను కథలంగలిగిన షష్ఠాంశము ఈ షడంశంబులుఁగల యీ విష్ణు పురాణము సర్వమును సంపూర్ణము

(వి-వి)—

సమగ్రము వ్రాఁత మంచిదే తప్పు లంతగా లేవు. శైథిల్యము మిక్కుటము గాఁ గలదు. గ్రంధపాతములు గలవు

ఇది రామానుజులవారు శ్రీ భాష్యమున వివరించినచొప్పు ననుసరించి చేయఁబడిన విష్ణుపురాణపు దెనుఁగుచేఁత-గ్రంధకర్త అప్పయ దీక్షితుఁడను వైష్ణవుఁడు వెంకటగిరి ప్రభువగు కుమార యాచభూపాలుని కాలమున రచితమైనది

---

## R No 752

Paper $10\frac{1}{4} \times 9\frac{3}{4}$ inches Foll 404 Lines, 20 in a page Mode of writing, not good Full of mistakes but free from omissions Good

Transcribed in 1924–25 from a MS of Rajah of Venkatagiri, Nellore district

Bound in two volumes Foll 403 and 404 are left blank

శంకరసంహిత

## ŚANKARASAMHITA

A rendering in Telugu of the Sivarahasyakhanda which is a portion of the Śankarasamhita of the Skāndapurāna, by Avadhanamu Pāpayapandita

Wants the introductory portion, otherwise complete

**Beginning**

క శ్రీజగదాలోకద్విజ
రాజజ్వలనేత్ర నా నిరంజనరాజ
త్తేజోమయ విగ్రహ వి
భ్రాజితగురుమూర్తి! పరమపావనకీర్తి!

వ ఇట్లు నిఖిలపురాణప్రవచనసమర్థబుద్ధిసమేతుండగు సూతుండు శౌనకాది మహర్షులం గని యమందంబగు నానందంబు నొంది మీకు

కుమారకృతంబగు శూరాది సకల దనుజసంహారక బు సవిస్తరంబుగాఁ దెలిపితి నింక నమ్మహామహుండు — — నిందు శుభ కర్మాకృత్యంబుల దివి యంజేసెదనని మరల నిట్లనియె

End

తోదకవృత్తము

సర్వజగద్గురు సంబ తిలోలా
సర్వసురామర సంస్తుతశీలా
వాగ్వసుధానల వాయుఖలీలా
ధూర్వహసజ్జన తోషకహేలా ׀

**Colophon**

ఇది శ్రీపరమేశ్వర వరప్రసాదలబ్ధ పాండిత్యచతుర సరసతరావధాన కులకలశ జలనిధిసుధాకర కోదండరామకుమార పావయపండితేంద్ర విరచితంబగు శ్రీశంకరసంహితయను మహాప్రబంధంబునందు సర్వం బును నుపదేశకాండము సంపూర్ణము

(వి-వి)—

సమగ్రము. రెండు సంపుటములుగా వ్రాయఁబడినది వ్రాఁత మంచిదిగాను విచ్ఛలవిడిగా ససందర్భముగా నున్నది తప్పులు పెక్కులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

స్కాందపురాణము శంకరసంహితలోని శివరహస్యఖండమున కిది తెలిఁగింపు బాలసరస్వతి వెంకటాచల కవి మొదలగువారు పలువురీ గ్రంథమును దెలిఁగించిరి. కాని యీ తెలిఁగింపు వానికంటె వేఱయినది అవధానము పావయ పండితుఁడు దీని రచియించెను గ్రంథావతరణిక లేదుగాన గ్రంథకర్తనుగూర్చి విశేషము లెఱుఁగ రాదు

---

## R No 753.

Palm leaf 14¼ × 1¼ inches Foll 87 Lines, 7 in a page Mode of writing, good But not free from mistakes and omissions Slightly injured

Purchased in 1924–25 from M R Ry Pendyala Subrahmanya Sastri, Pandit, Rajah's High School, Pithapuram

(*a*) ఉషా పరిణయము

## USĀ PARINAYAMU

Foll 1*a*—14*b*

A Prabandha in the Yaksagāna metre narrating the story of the marriage of Usā, daughter of Bānāsura with Aniruddha, grandson of Krisna, by Cannaya, son of Krisna of Ātrēyagotra and Āpastamba-sutra

Complete

**Beginning**

క శ్రీరుక్మిణీ కుమారుని
కూరిమిపుత్త్రు ననిరుద్ధుగుణగణ్యునిఁదాఁ
గోరియు.బాణతనూభవ
యారయఁగల గూడి పెండ్లియాడిన కథయున్.

జంపె.

వివరించుటకు నేను వేడుకలుకొనసాగ
కువలయేశునిపౌత్త్రుఁ గోరిభజియింతున్
మదనాత్మజుఁడు వనియు
మఱినాత్మలోపలను
ముదముమీ అనిరుద్ధు
వదలకను గొలుతున్-
శిష్యుండు శ్రీగురుని సేవచేసినరీతి
ఋష్యకేతనుఁ జాలరూఢిగాఁ దలఁతున్.

**End**

వన్నెమీఱఁగ నార్యవరులచేఁ జాల
చెన్నయనామంబు చెలఁగినవాఁడ
పద్మనాభస్వామి పాదముల్ హృదయ
పద్మంబునను నెంతో పటువుగానిలిపి
భామ యుషాకన్య పరిణయమనఁగ
నీమహిరచియించితి యక్షగానంబు
భూచక్రమందును పూజితంబమర
ఆచంద్ర తారార్కమై యొప్పుచుండ.

(వి-వి.)—

సమగ్రము వ్రాంత చకరీనది. తప్పు లున్నవి శైథిల్యము కలదు గ్రంథపాతము లున్నవి

శ్రీకృష్ణుని పౌత్రుండగు ననిరుద్ధుని బాణునికూంతురగు నుషాకన్య వివాహామాడు కథ యక్షగానరూపమున నిందుఁ జెప్పఁబడినది గ్రంథకర్త పేరు చెన్నయ

---

(*b*) కీర్తనలు.

KĪRTANALU

Foll 15*a*—50*a*

A collection of philosophical songs based on Kṛṣṇalīla etc Most of them were composed by Cannava, the author of Uṣāpariṇaya described under subdivision (*a*) of this No

Complete

**Beginning:**

శ్రీకరమగు పరశివుడే యింతయు
సిద్ధబ్రహ్మమునై చెలంగుగా
లోకములును నాలోకములవలను
చీకటి వెలిగే చిన్మయమూర్తియు
శ్రీకరమగు పరశివుడే యింతయు
సిద్ధబ్రహ్మమునై చెలంగుగా.

పల్లవి

ప్రాకటముగ తచ్ఛక్తియుతానై
ప్రబలిననాదము బిందువునై
జోకతోకళయై మూడరుద్రుండై.

* * * *

**End:**

లాలిగురుపుత్రికిని లాలి ఓరన్నా
లాలినిర్గుణు ప్రాణలలన కోరన్నా
మేలుగా ముమ్మూర్తులమెలంత కోరన్నా
చాల యిటరీతియు సల్పు సఖికన్నా

* * * *

కలిమి లేములు రెండు ఘనమాయెరన్నా ।
కలిమి లేములు రెంటికడ వెల్లురన్నా ।
తెలవంజూడగరాని తానెతానన్నా ।
పలుమాటలేల యిక యిలపరిచి చెన్నా ।
లాలి గుటపుత్రికిని లాలి ఓరన్నా ।

(వి-వి)—

సమగ్రము ప్రాంత తిన్ననిదే. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

వేదాంతము కృష్ణలీలలు మొదలగు విషయములపై నిందు విడి విడి కీర్తనములు పెక్కులు గలవు ప్రాయికముగా నివి యెల్ల 'చెన్నయ' రచియించినవే

(c) యయాతి చరిత్రము

YAYATI CARITRAMU

Foll 50a—79b

A Prabandha narrating the story of Yayāti, father of Pūru of the lunar dynasty, as found in the Śrī Bhāgavata

Contains the first Aśvāsa only

Foll 79b—87 Contain some topics on Astrology

Beginning :

క॥ శ్రీరామా సీతేశ్వర
కారుణ్య కృపాకటాక్ష కామిత ఫలదా ।
సారసలోచన సురనగ
ధీరా దశరథ (కుమార ?) దీనార్తిహరా ।

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా శ్రీమన్మహా భాగవత ప్రకారంబున యయాతి చరిత్రంబను ప్రబంధంబు రచియింపంబూని యిట్లని నుతియించెద.

End :

ధరాధరేంద్ర ధైర్యమానదానశీల భూషణా
సురేశకోటిబాలె భూతిసూర్య వంశమండనా
హిరణ్య గర్భజేయు లోకమెల్ల యేరియొప్పినా
పరాపరావరాత్మ దేవ పంకజాక్ష రాఘవా ।

**Colophon.**

ఇది శ్రీమదాపస్తంబసూత్ర ... సద్గుణ జనానందపాత్ర ... చన్నయనామధేయ ప్రణీతంబైన యయాతిచరిత్రంబను మహాప్రబంధం బునందు ప్రథమాశ్వాసము

కడపట ౧౮ పుటలలో జ్యోతిష విషయములు వ్రాయబడినవి

(వి-వి)—

అసమగ్రము ప్రథమాశ్వాసము మాత్రమే ... వ్రాతప్రతి నిదే, తప్పులున్నవి శైథిల్యమించుక గలదు ... గొలందిగాఁ గలవు

యయాతి చరిత్రమని పేరుగల యీ ప్రబంధము చెన్నయ యనువానిచే రచింపఁబడినది

---

R No 754

Paper 10¾ × 2¼ inches Foll 210 Lines, 2 in a page Mode of writing, not bad Contains mistakes Good

Fol 210 is left blank

Transcribed in 1925-26 from a MS of Zamindar of Challapalli, Kistna district

దేవీ భాగవతము

DĒVĪ BHĀGAVATAMU

A rendering in Telugu of the Sanskrit work of the same name, by Pāpayarādhya of Vēmanāradhya family

Contains the Skandhas 8—12 complete

**Beginning:**

క. శ్రీకాంచీపుర వల్లభ
లోకాతీతానిటాల లోచన పూర్ణ
ప్రాకామ్య నిగమవర్ణ్యక
ధాకలిత గుణాభిరామ దైవలలామా!

వ దేవా సకల పురాణేతిహాస కథా సుధాస్వాదన నిష్ఠాంద్రులగు సమ్మునిచంద్రులకుఁ దన్మనోరథరథ చోదనాసూతుండగు సూతుం డిట్లనియె

శా. శ్రీవాణీ గిరిజాంగనల్ పదనఖశ్రేణీ ప్రతిచ్ఛాయలన్
సేవాకాలములందుఁ గాంచి పతులం జీఱంగ వారెల్లర
ట్లేవీక్షించి యాగాంతరంబుల నిజవ్యాపారసంసిద్ధికై
ప్రోవల్లట్టి సృజించెనంచుఁ దలఁపన్బ్రోల్పొందుఁ జిద్రూపిణీ !

**End.**

క. నిత్యానుభావ భాస్వద
పత్సమయోద్రేక తిమిర భాస్కర సత్యా
సత్యానుగ్రహ నిగ్రహ
మృత్యుంజయ చక్రితాబ్జ మిత్రా మిత్రా !

విద్యున్మాల.

భావాభావా కారాధారా
దేవా శ్రీవాణీశా ధీశా
జీవాజీవా లీలా లోలా
సేవాధీవ ద్రష్టాధ్యక్షా !

క. దేవీ భాగవత స్కం
ధావళి ద్వాదశము శచ్చమాంబా జగ్గ
న్నావరుల కభీష్టార్థ
శ్రీ వెలయఁగఁ జేసి సుప్రసిద్ధిం జెందున్

**Colophon:**

ఇది శ్రీపరమ శివాద్వైత భావనా సాధ్యసిద్ధ సారస్వత విద్యాసా
న్నిధ్య వేమనారాధ్యవంశార్ణవ కళానిధాన పాపయారాధ్యాభిధాన
ప్రణీతంబైన శ్రీదేవీభాగవతంబను మహాపురాణంబునందు ద్వాదశ
స్కంధము

(వి-వి.)—

8 నుండి 12 స్కంధముదాఁకఁ గలదు.

వ్రాఁత కొంత చెడ్డది. కొంత మంచిది. తప్పులున్నవి. శైథి
ల్యము లేదు గ్రంథపాతములు లేవు.

ములుగు పాపయారాధ్యులవారు రచియించిన దేవీ భాగవతమున
భాగము.

## R No 755

Paper $10\frac{3}{4} \times 9\frac{3}{4}$ inches Foll 200 Lines 20 on a page Mode of writing not bad Contains mistakes and breaks off in many places. Good

Restored in 1925–26 from a MS purchased from M R Ry Vēlam Vēnkataraya Sastri, Alurpadu Kodavalur post, Nellore district

స్థలత్రయ పురాణము

### ŚTHALATRAYA PURĀNAMU

Same work as that described under R No 709 *ante*

Complete

(వి-వి)—

వ్రాంత మంచిది తప్పులున్నవి శైథిల్యము గ్రంథపాతము లు మిక్కిలి గలవు.

ఇది ఆర్. నె 709 దున వర్ణితమైన గ్రంధమే

---

## R No 756

Palm leaf $16 \times 1\frac{3}{8}$ inches Foll 53 Lines, 6 on a page. Mode of writing, good but contains mistakes, breaks off in some places Injured

Purchased in 1925–26 from Pendyala Venkatasubrahmanya Sastri-Pandit, R C H High School, Pithapur, East Godavari district

భగవద్గీతలు

### BHAGAVADGĪTALU

A metrical rendering in Telugu of the well-known Bhagavadgīta by Dattoji Pandita

Incomplete

(వి-వి.)—

ఆద్యంతములు లేవు. అసమగ్రము. వ్రాంత తిన్ననిదే తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు

వేముగంటి దత్తోజి పండితుండు రచించిన భగవద్గీతా పద్యకావ్య మిది. ఆద్యంతములు లేవు గాన గ్రంథకర్త విషయమిక్కడ విడువం బడినది.

R No **757.**

Paper 10¾ × 9¾ nches Foll 76 Lines, 20 in a page Mode of writing not bad Contains mistakes but free from omissions Good

Restoied in 1925–26 from a MS of the Government Oriental MSS Library, Madras

Foll 76 is left blank

కాశీమహిమార్థ దర్పణము.

KAŚĪMAHIMĀRTHADARPANAMU

A rendering in lucid Telugu prose dealing with the greatness and religious sanctity of the town Kāsī (Benares) It seems that this work was based on a similar work in Kannada language The author, Nanjarāja of Kalule was the younger brother of Devarāja, son of Vīrarāja and grandson of Doddarāja, who was the commander-in-chief of Mysore. The author composed several works in Telugu and was a great writer in Kanarese

Incomplete

**Beginning**

ఒకానొక కాశీపట్టణము భూమియందు వున్నదైనాగాని అక్కడ వాసంచేసుకొని వుండే వారికి పునర్భవాదులులేవు గనుక తాను భూమి యందయినాగాని స్వర్గమందు వుండేవారికి పునరావృత్తిగలదు. తనయందు వుండే వారికి పునరావృత్తిలేదు గనుక తాను స్వర్గమున కంటె క్రిందుగావుండేటిదయినా మీదయినదనుగాని తాను కోట కొత్తళ ములచేత కట్టబడినదయినా భవబంధములను విడిపించును.

**Colophon.**

మఱియును కర్ణాటభాషా విరచితంబుగా మహాశూర సేనాధిప దొడ్డరాజ పౌత్ర వీరరాజపుత్త్రదళపతి దేవరాజానుజ కళులె నంజ రాజ భూపాలుండు స్కాంద పురాణోక్తంబుగా కాశీమహిమార్థ దర్పణ మందు మణికర్ణిక యుత్పత్తి చెప్పిన యిరువదియాఱవ అధ్యాయము

**End**

గంగామహిమ చెప్పేటివారికి సకల పాప పరిహారము మా యామోహితులయినవారికి గంగ ఒక్క నది మాత్రము గనిపించును. జన్మాంతర సంస్కారముచేతను గంగయొక్క భక్తి దొరకును, ఆ భక్తి గలిగినవారికి బ్రహ్మ ఉమరావతీ పట్టణము మొదలయిన వాటియందు విడిది చేసుకొనియుందురు.

(వి-వి)—

అసమగ్రము. వ్రాంత మొకమాదిరిగ నున్నది తప్పు లున్నవి. శైథిల్యము లేదు గ్రంథపాతములు గలవు

స్కాంద పురాణమందలి కాశీఖండమునకిది తెలుగయియుండును. ఇందు కాశీ క్షేత్ర మాహాత్మ్యము విరివిగా దెలుపబడినది. కన్నడమున రచితమయినదాని బట్టి యీ తెలుగుచేత యేర్పడినట్లున్నది మైసూరు సేనాధిపతి యగు కళలె దొడ్డరాజు మనమండును, వీరరాజు కొడుకును, దేవరాజు తమ్ముండును నగు నంజరాజు దీని రచియించెను ఈతండు తెలుగున హాలాస్య మాహాత్మ్యమునకు వచన గ్రంథములను మఱికొన్నింటిని రచియించినాండు

---

## R No 758

Paper 10¾ × 9¼ inches Foll 352 Lines, 20 in a page Mode of writing, bad Contains mistakes and breaks off in some places Good

Restored in 1925–26 from a MS of the Government Oriental MSS Library, Madras

Bound in two volumes

పార్థసారథి విజయము.

PĀRIHASĀRATHI VIJAYAMU

A Telugu rendering in the Yaksagāna metre narrating the story of the tenth Skandha of the Śrībhāgavata The author Kuppanakavi of Alūi was a disciple of Kastūriranga and has dedicated this work to God Pārthasārathiswāmi worshipped at Triplicane, Madras The work was written at the instance of Vēnkatācalanrpāla, who was the elder brother of Rāmānuja and Nārāvana sons of Tiruvēnkataksamādhinātha of King Dāmōdara's family The author also wrote Rāmāyana in the Yaksagāna metre at the instance of the said Vēnkatācalanrpāla

Complete

**Beginning**

శా॥ శ్రీలక్ష్మీవదనార విందము నిజశ్రీ ద్దర్పని
ర్వేలన్నూత్నరుచి మధ్య గుల్కు జగతీ విఖ్యాతమిత్రార్కృతిన్
జాలన్ రంజిలు పార్థసారథి యశస్సౌభాగ్యసద్వైభవ
శ్రీలన్ సానుజ వేంకటాచల విభున్ జెల్వొందగా బ్రోవుతన్.

సీ. శ్రీరమారమణి సంతోషప్ర
దాయకుండతులిత సాయకుండు
కమనీయకుముద పుష్కరిణీతటీ ఖేల
నాదరుండు సరోరుహోదరుండు
ఘనతర భాస్కరాంగ విమానవిహరణ
రంజనుండు విపక్షభంజనుండు
బలధనంజయ ముఖ్య భక్తనికాయను
శ్రీకరుం డతుల గుణాకరుండు.

పార్థసారధి వరకృపా భవ్యశరధి
ప్రబలురామానుజేంద్ర నారణనృపాల
వర్యగోపాల కాగ్రజవరుని వేంక
టాచలేంద్రుని బ్రోవుతమహారహంబు.

* * * *

ప్రకటించి నన్నయ భటాదులైన
సకలాంధ్రకవుల నిచ్చలుం గొని యాడి
కవితా ధురంధరుం గస్తూరిరంగ
కవిని మద్గురుని వేడ్కను సన్నుతించి

* * * *

కథ మొల్లదశమహాస్కంధంబు గాన
నవి తెనింగింప నే నాత్మఁదలంచి
ప్రవిమలధీయుక్తిం బరగుచున్నంత

* * * *

ధీనుత శ్రీమదాత్రేయ గోత్రుండు
భాను తేజుండు కృపాసమృద్ధుండు

* * * *

దామోదరావనీధవుని వంశజుఁడు
శ్రీమహితాచార చిరగుణాధికుఁడు
తిరువెంకటక్షమాధిపుని నందనుఁడు
సరససాహిత్య లక్షణ విచక్షణుఁడు

* * * *

అసదృశగోపాలకా వనీపాల
గసకనారాయణ రామానుజేంద్రు
తెలిపి సోదరులుగా నెఱుసగ్రజుఁడు

* * * *

అతిశయంబుగను జెన్నలరఁ గొల్చుండి
నను నరసింహాఖ్యనాసమున్నతుని
ఘన సత్కవిత్వలక్షణ విచక్షణుని
కస్తూరిరంగ సత్కవి శిష్యభూప
కస్తుత్యుఁ గుప్పనకవినిరప్పించి

* * * *

అరసిరామాయణ యక్షగానంబు
సచలితంబుగ మదియాంకితంబుగను
రచియించి యొసఁగి తారవితారకముగ

* * * *

జనసుతంబుగఁ బార్థసారథి విజయ
మను పేరు దనరమదంకితంబుగను

* * * *

షష్ఠ్యంతములు.

అర్ధచంద్రికలు

కవిజనసంరక్షణ దక్షునికిఁ
అవిరళ విక్రమ హర్యక్షునికిఁ
అనుపమ బంధుజనావనరతికిఁ
జనరంజన భుజశౌర్యోన్నతికిఁ
గురుశైలాధిక గురుతరధృతికిఁ
సలలిత వెంకటాచల నరపతికిఁ.

**End.**

క. చోళపురీ మహితాన్వయ
పాలననిఖిలాకృతార్థి భరణధురీణా
లాలిత సత్కవిజనకలి
తాలంకార ప్రవేచనాద్భుత ధిషణా!

**Colophon**

ఇది శ్రీలక్ష్మీనృసింహ దయాసంపాదిత సరస సాహిత్య విరాజితా
లూరి వేంకటేశ్వరార్య నరసమాంబా తనూజాపస్తంబ సూత్ర కాశ్యప
గోత్ర పవిత్ర కస్తూరిరంగ సద్గురు పాదారవింద భజనానందిత హృత్స
రోజ కస్తూరి (?) కుప్పన కవిరాజ ప్రణీతంబైన పార్థసారధి విజయంబను
మహా భాగవత యక్షగాన ప్రబంధంబునందు ప్రద్యుమ్న సంభవం
బును, శంబర వృత్తాంతంబును, వి
ప్రసుతుల మరలం దెచ్చుటయు ననుకథలం బ్రథితంబగు దశమస్కంధ
మున నుత్తరభాగము సంపూర్ణము

(వి-వి)—

సమగ్రము రెండు సంపుటములుగానున్నది వ్రాఁత చక్క
నిది గాదు తప్పు లున్నవి శైథిల్యము లేదు. గ్రంథపాతములు
అల్పముగాఁ గలవు

ఇది యక్షగానముగా రచియింపఁబడిన భాగవత దశమస్కంధము.
గ్రంథకర్త। ఆలూరి? కుప్పన కవి కస్తూరిరంగకవి శిష్యుఁడు
శంకరవిజయ మీతని కృత్యంతరము. తిరువల్లిక్కేణిలో వెలసిన పార్థ
సారథిస్వామి కిది యంకితము సేయఁబడినది చోళపురపు దామో
దర రాజు వంశమువాఁడును, తిరువేంకట క్ష్మాధిపుని కొడుకును,
రామానుజ, నారాయణ నరపాలుర కగ్రజుఁడునునగు వెంకటాచల
నృపాలుని ప్రేరణమున నిది రచింపఁబడినది ఈ కవి దీనికిఁ బూర్వ
మీతని ప్రేరణముననే రామాయణమును యక్షగానముగా రచి
యించెను

---

**R No 759.**

Paper 10¾ × 9¾ inches Foll 4 Lines, 20 in a page Mode of writing bad Full of mistakes Breaks off in some places Good

Restored in the year 1925–26 from a MS of the Government Oriental MSS Library, Madras

నల్లందివారి వంశావళి.

NALLANDIVĀRI VAMŚĀVALI

A short genealogical history relating to the Śrivaisnavas of the Nallandigal family of Śrirangam

Complete

**Beginning.**

సీ. శ్రీయఃమేల్మంగ తాయా . . .
శస్తకస్తూరి కాసారమిళిత
పరిమళలహరీ విభాస్వర కౌస్తుభ
హారవిశాలమ్మురంగ .

* * *

వనరాశిగాంభీర్య వైష్ణవకులధుర్య
ధరణీంద్ర ధైర్య ప్రతాపసూర్య !
ఆలకింపుము భవదన్వయస-జాత
విఖ్యాత పౌరుషవృత్తులెల్ల
ధరనూటయెనిమిది తిరుపతులందును
కనకరత్నవిచిత్ర కలితశృంగ
మభ్రంకషోత్తుంగహర్మ్య సరదంగ ?
మబ్జాబ్ధి నీరూజదమితభృంగ
మగునట్టి శ్రీరంగమలరు శ్రీహరికిని
వాస యోగ్యంబయి పరమవైష్ణ
వాచార్య సేవితంబగుచు డెబ్బదిరెండు
సింహాసనంబులచేతఁ దనరి
యచ్చట వేదవేదాంగ పారంగతుం
డనఘుఁడై యన్నిట నధికుఁడగుచు
మీలు కూరత్తాళువారు నానాకవిప్రుఁ
డలరు సమ్మేటి నెయ్యాఁబు చెలఁగ
తన శిష్యులందు నుత్తమగుణాఢ్యుండైన
నల్లందిఘుల్ వంశనారణేంద్రు
పిలిచి యీ శ్రీరంగతలము మ్లేచ్ఛాక్రాంత
మైనచో నుర్వి-యనర్హమనుచు
రంగవల్లభునిఁ గేరళభూమిలోనుంచి
యఱువది యబ్దంబులాయెఁ గనుక
నీ తురుష్కులనోంచి యుచ్చాటికాగంగ
భర్తను దోడ్తెచ్చు పాటి నేర్పు
మఱియొకరికి లేదు మంత్రశక్తిగలట్టి
యోధవు నీవాటనానరునీదు.

* * * *

**End**

అతని కూరిమి తమ్ముఁడైన కస్తూరయ్య
ప్రతి లేనిబుద్ధిచేఁ బరిఢవిల్లి
అప్పాజికైవడి నలయుగంధరుమాడ్కి
స్వామి కార్యముపట్ల జాగ్రత్తఁ గని
రౌతురాణువవారి రీతిగా నడపించి
బంధుకోటులకు సంపదలొసంగి

*  *  *  *

నీచేతఁ గైకొన్న యాచకుఁడల్ల కు
బేరుని కప్పులు పిల్చియిచ్చు
నినుశరణంబు చెందన శాత్రవుఁడు నీకు
పరమ మిత్రుండయి పరిఢవిల్లు
నీగుణములను వర్ణింపఁగా శక్యమా
భారతీపతి బృహస్పతులకైన
నేర్చినమాత్రంబు నే రచియించితి
గైకొనవయ్య జగన్నుతనయ

*  *  *  *

చెలఁగుదండాడ వరదదేశికవతంస
శంఖచక్రాంకిత భుజాగ్రసచివహంస
తిరుమలాచార్యులికుమార స్ఫురదుదార
అర్థిమందార ! అయ్యవారయ్య ధీర !
ధరణివర్ధిల్లు మాచంద్రతారకముగ.

(వి-వి )—

సమగ్రము వ్రాఁత మంచిదిగాదు తప్పుల కుప్ప శైథిల్యము లేదు అకడకడ గ్రంథపాతములు గలవు

శ్రీరంగక్షేత్రమున వసించుచున్న నల్లందిఘుల్ వంశమువారగు వైష్ణవులచరిత్ర మిందుఁగలదు దీనిని రచించినవారెవరో యెఱుఁగరాదు. ఇందుఁ జరిత్రోపయుక్త విషయములు గొన్నిగలవు

---

**R No 760**

**Paper** 10¾ × 9¾ inches **Foll** 224 **Lines**, 20 in a page **Mode of writing**, not good full of mistakes

Restored in the year 1925-26 from a MS of the Government Oriental MSS Library, Madras

శ్రీనివాస విలాసము

ŚRĪNIVĀSA VILĀSAMU

The greatness of God Śrīnivāsa worshipped at Tirupati as described in the Vārāha, Vāmana, Brahmāṇḍa, Pādma, Garuda Skānda and Mārkandēya Purāṇas is written in Dvipada metre The work contains six Āsvāsas and is also known as Śrīnivāsa vilāsa sēvadhi The name of the author is Vēnkatarya of Ālūr

**Beginning**

శ్రీకాంతకిరవుగాఁ జెలఁగు పేరురము
వైకుంఠమిదియంచు వంచినకరము
మఱపిలిగ్గులు గులుకు మకరకుండలము
అలరుకౌస్తుభశోభ హారమండలము
కంతుసంతునకు సగ్గళమైనగళము
వింతదర్పణమున వ్వెడుగండతలము
కరుణఁజిలుకు వెడందకన్నుఁదోవి
చిఱునవ్వు తేటరంజిల్లు కెమ్మోవి
కప్రపునామంబు కళలీను మోము
ఛత్రకిరీటంబు తెఱఁగొందుగోము
ఘనకటీతటబద్ధకనకాంబరంబు
కనదురుమేఖలాగణడంబరంబు

* * * *

విలసత్సరోజాత్రు వేంకటాధ్వరుఁ
భావించి సేవించి ప్రార్థించి నతులు
గావించి మతియు జగత్త్రయీజననిఁ
గలశాంబునిధిరాజకన్యకామణిని
నలమేలుమంగమ్మ నర్మిలిఁ గొలిచి

* * * *

వరలంగ వాధూల వంశావతంసు
వాచాతిగజ్ఞాన వైభవు నస్మ
దాచార్యు నన్నాది నప్పలాచార్యు
భజియించి వాల్మీకి బాదరాయణుని

* * *

ధరసంస్కృతప్రాకృతముఖభాషలను
ద్రవిడాంధ్రములఁ బ్రబంధము లెన్నియైన
సవరించితివి మాకు సంతసంబెసఁగ
నాకకృతి శేషాచలోరువైభవము
ప్రకటితాలంక్రియాస్పదవర్ణనలను
విసువక శృంగారవీరాద్భుతాది
రసములు భావముల్ రంజిల్లునట్లు
ద్విపదలోకుల కెల్లఁ దెలివిగ
. . తెనుఁగునఁ దేటగావించు
వారాహవామనబ్రహ్మాండపాద్మ
గారుడస్కాంద మార్కండేయముఖ్య
బహుపురాణోక్త సంబంధంబువలన
గహనమై పెనగొన్న కథలను గూర్చి

* * * *

కసటు దేర్చి ప్రసిద్ధకథ సంగ్రహించి
వెసఁ జిత్రకథ చాల విస్తృతరీతి
గదియించి పునరుక్తకథఁ ద్రోచి మొదలు
తుదయేర్పఱించి బంధురసంగతులను

* * * *

వెలయఁ దెలుఁగున ద్విపదకావ్యమున
నల వేంకటాద్రిమాహాత్మ్యమిం పొంద
శ్రీనివాసవిలాససేవధి యనఁగ

---

భూనుతవిఖ్యాతి పొసఁగ సల్పెదను.

**End:**

వరుసగా వారాహవామన పాద్మ
గరుడపురాణాది కథితమార్గమున
వివరించినట్టి శ్రీవేంకటాధీశ
భువనాద్భుత చరిత్రము సంగ్రహించి
యెల్లవారలు విని యింపొందునట్లు
తెల్లమిగాఁ దేర్చి తెనుఁగున ద్విపద
లింపొంద రసభావయుక్తి సంగతుల
వఱలి యష్టాదశవర్ణనల్మెఱయ

శ్రీనివాసవిలాస సేవధియనఁగ
పూనిమహాకావ్య పూర్ణలక్షణము
గలుగనే నొనరించు కబ్బంబు జగతి
లలితసందర్భ కల్హారసజ్ఞులకు
పరమభక్తులకును బండితేంద్రులకు
సరసచిత్తులకు మాత్సర్యదూరులకు
వీనులనమృతంపు వెల్లి జల్లుచును
మానితానందంబు మదినించుఁగాత!

*　　*　　*　　*

శ్రేష్ఠలూర్యన్వయ శ్రేష్ఠశీలుండు
శ్రేష్ఠమహాశయ శ్రీధురీణుండు
గోత్రభారద్వాజ గోత్రవర్ధనుఁడు
సూత్రదాపస్తంబ సూత్రానువర్తి
అష్టభాషాకవిత్వార్జిత ప్రోద్య
దష్టావధానవిఖ్యాతబిరుదుఁడు
శ్రీకృష్ణయార్య లక్ష్మీగర్భవార్ధి
రాకాసుధానిధి రాజపూజితుఁడు
వివిధవిద్యాశాలి వేంకటార్యుండు
సవరించు శ్రీనివాస విలాసమునను
హారుహొందునిది యష్టాశ్వాసమగుచు॥
ధరఁబొల్చు నాచంద్రతారార్కముగను

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత మంచిదిగాదు తప్పుల కుప్ప శైథిల్యము గ్రంథపాతములు లేవు

తిరుమలపై వెలసిన శ్రీనివాసమూర్తి మాహాత్మ్యాదికమును వారాహ వామన బ్రహ్మాండ పాద్మ గారుడస్కాంద మార్కండేయాది పురాణములనుంచి సంగ్రహించి శ్రేష్ఠలూరి వేంకటార్యుఁడనుకవి యారాశ్వాసముల ద్విపద ప్రబంధమునుగా దీనిని రచియించెను శ్రీనివాసవిలాససేవధియనియుఁ గవి దీనిఁ బేర్కొనెను

## R No 761

Paper 10¾ × 9¾ inches Fol¹ 40 Lines, 20 in a page Mode of writing, not bad Contains, mistakes but free from omissions Good

Restored in 1923–27 from a MS of the Government Oriental MSS Libiarty, Madras

Fol 40 is left blank

వేంకటేశ్వర వచనాలు

VĒNKATĒSVARAVACANĀLU

Same work as that described under R No 219 *ante*

Contains only 53 Vacanas

**Beginning** ·

శ్రీ వేంకటగిరిదేవా ! నాదేహంబు నీవుండెడి నిత్యనివాసంబు నాజ్ఞానవిజ్ఞానంబులు మీ యుభయపార్శ్వంబుల దీపంబులు నాముకుళితమైన యూర్పులు మీయిరుదెసలం బట్టెడు నాలవట్టంబులు నామనోరాగంబు మీకుఁ జెంద్రకావి వలువ నీకు ౹మొక్కినెత్తిన చేతులు రెండును మకరతోరణంబులు నాభక్తిగాను మీకు సింహాసనంబు నా మేనంబొడమిన పులకలు మీకు గుములుగూర్చి సమర్పించిన పూబంతులు నిన్నునుతించిన నుతుల యక్షరరవంబులు భేరీభాంకార ఘంటానినాదంబులు నా పుణ్యపరిపాకంబులు నీకు నైవేద్య తాంబూలాదులు మదీయ నిత్యసేవా సమయ నిరీక్షణంబులు నీసర్వాంగంబుల నలందిన తట్టు పునుఁగు నాసాత్త్విక గుణంబులు నీకు ధూపపరిమళంబులు నీవు దేవుఁడవు నేనర్చకుండను ఈరీతి నిత్యోత్సవంబు నాయందు నవధరించగదవే శ్రీ వేంకటేశ్వరా !

**End:**

కేశవ, నారాయణ, మాధవ, గోవింద, విష్ణు, మధుసూదన, త్రివిక్రమ, వామన, శ్రీధర, హృషీకేశ, కేశవ, పద్మనాభ, దామోదర, సంకర్షణ, వాసుదేవ, ప్రద్యుమ్న, అనిరుద్ధ, పురుషోత్తమ, అధోక్షజ, నారసింహ, అచ్యుత, జనార్దన, ఉపేంద్ర హరి, శ్రీకృష్ణులనియెడు చతుర్వింశతి నామంబులు ముక్తికిందావులు పుణ్యముల కునికిపట్లు.

(వి-వి)—

అసమగ్రము. ౫౩ వచనములు మాత్ర మిందుఁ గలవు. వ్రాఁత యొకమాదిరిగా నున్నది తప్పు లున్నవి. శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్ నెం 249 గున వర్ణితమైనదే కాని యిది యారంభ
మునుండి కలదు దీని రచియించిన వారెవ్వరో తెలియరాదు

---

## R No 762

Paper 10¾ × 9¾ inches Foll 97 Lines, 20 in a page Mode of writing good Free from mistakes and omissions Good

Transcribed in 1926–27 from a MS of M R Ry Rao Sahib G V Ramamurthi Pantulu, Parlakimedi Ganjam district

Fol 97 is left blank

లక్ష్మీనారాయణ విలాసము.

### LAKSMINĀRAYANA VILĀSAMU

A Prabandha in the Yaksagāna metre describing the story of the marriage of Laksmi with God Nārāyana, by Acyutarāmakavi (author of Suratānīparinava) of Vārānasi and Appalāryakavi of Daruvur, who were assisted by Appālarya of Kondūpalli The work has been dedicated to God Kūrmanātha worshipped at Śrīkūrmaksētra in the Ganjam district

Complete

**Beginning**

ఉ॥ శ్రీనెక్కొండదనకు మునుఁ జేరిచినన్మ్రరమాన జేసినాఁ
డానని యర్థనోయనుచు నయ్యబలన్నతతంబుమాపుకన్
బూనిన యాదికూర్మపతి పూర్ణదయానిధిఁ భక్తలోకసం
తానుఁడు మాకజస్రఫలదాయకుఁడై విలసిల్లఁగావుతన్.

సౌరాష్ట్రి రాగము - త్రిపుట

శరణు శరణు హరీ!

పరమపూరుష దీనపోషణ పద్మనాభ జనార్దనా!
వరద కేశవ భక్తవత్సల వాసుదేవ దయానిధీ! శరణు.
భావజ్ఞన శతకోటి సుందర పాణిసంభృతమందరా!
శ్రీవధూవర చిన్మయాత్మక దేవదేవపరాత్పరా! శరణు
నిరుపమానంద స్వరూపక నిఖిలభువన ప్రాపకా
పరమహంస మనోబ్జ భాసుర నరహరీ మురమర్దనా

నిర్మలాంతఃకరణ మానవశర్మదా జితదుర్మదా
భర్మచేల యనంతవామన కూర్మనాథ త్రివిక్రమా !

* * * *

క. మఱిఁగంటి భట్టగన్వయ
శరనిధి రామానుజార్య చంద్రునివిద్యా
గురు మద్గురు సేవించెద
సరసకవిత్వార్థసార సంగ్రహబుద్ధిన్.

* * * *

సీ. శ్రీరమారమణ సంసేవాపరుండు సం
గీత విద్యానిధి కీర్తిగతుఁడు
చతురుండు రామానుజార్య పౌత్త్రుఁడు సత్య
సంధుండు శాంతుండు సద్గుణమణి
యైనరంగాచార్య నమలగుణాఢ్యవేం
కటలక్ష్మికిని సుతాగ్రణియురుగుణ
భవ్యుండు శ్రీకాంతు పర్త్యప్పలార్యుండు
మమ్ముఁజూచి యిట్లనె మధురఫణితి
మనుపు సురతాణిపరిణయ మొనరఁబద్య
కావ్యమును రచియించిన కరణినిసిరి
కన్నెపెండిలి కత యక్షగానముగనొ
నర్పఁదగినది మీకృతి నేర్పునకును

వ. అదియును శ్రీమత్పద్మపురాణోక్త ప్రకారంబున ఘటించి లక్ష్మీనారాయణవిలాసంబను నామంబున శ్రీకూర్మనాథున కర్పించిన మేలుగదా నేనును భావరాగతాళ ప్రాణ ప్రమాణ స్థానసందర్భంబుల నూనంబుగా గానవిద్యావిశారదులౌనన తత్కటాక్షంబున జాళువా హొన్నున మేలికమ్ములుగూర్చిన లీలనేతన్మాత్రసహాయం బొనర్చెదనని మఱియు నిట్లనియె

క. మానితమై జగముల ల
క్ష్మీనారాయణ విలాస మృదుకావ్యము స
ద్గానాకరమై కూర్మపు
రీనాథునిపేర వెలయు శ్రీకరముగదా !

* * * *

గీ సరవిఁదరువూరి యప్పలాచార్యవార
ణాసి యచ్యుత - మలన్వాసి కెక్కు
నరసకవులము శ్రీహరి చరణకమల
భక్తి సంయుక్తులము భాగవతహితులము

**End** :

కూర్మనాయకాయమంగళం నిజభక్తలోక
శర్మదాయకాయమంగళం
కర్మబంధమోచనాయ, నిర్మలాబ్జలోచనాయ
దుర్మదదమన ధర్మదమన, కర్మణే శుభశర్మణే శ్రీ

* * * *

కామకోటి సుందరాయ, కరధృత ఘనమందరాయ, స్వామినే
శ్రీకామినే శ్రుతిగామినే కృతిస్వామినే శ్రీ॥ కూర్మనాయకాయ మంగళం

**Colophon** :

ఇది శ్రీమద్రమారమణ చరణ సేవాపరాయణ భాగవత విధేయ
దరువూర్యప్పలాచార్య వారణాస్యచ్యుత రామనామకోభయకవి ప్రణీ
తంబైన శ్రీలక్ష్మీనారాయణవిలాసంబను శృంగార గేయప్రబంధంబునందు
సర్వంబును తృతీయాశ్వాసము

(వి-వి)—

సమగ్రము. వ్రాంత తిన్ననిది తప్పు లంతగా లేవు శైథి
ల్యము లేదు గ్రంథపాతములు లేవు

లక్ష్మీనారాయణవిలాసమని పేరుగల యీ యక్షగానమున శ్రీమ
న్నారాయణమూర్తి లక్ష్మీదేవిని పెండ్లాడు కథ వర్ణితమయినది సుర
త్రాణీ పరిణయమను ప్రబంధమును రచియించిన వారణాసి అచ్యుత
రామకవియు, దరువూరి యప్పలార్యకవియు దీని రచియించిరి. ఇందు
సంగీత విషయము రచియించుటలో కొండుపర్తి అప్పలార్యుఁడు సహాయ
మయ్యెనట ! ఈ కృతి శ్రీ కూర్మమున వెలసిన కూర్మనాథస్వామి కర్పిం
పఁబడినది.

R No 763.

Paper 0¾ × 9¼ inches Foll 4 Lines 20 in a page Mode of writing, good and free from mistakes Good

Transcribed in 1925-26 from a MS of Śri Rajah Erlagadda Ankinīdu Prasada Bahadūr, Zamindar of Challapalli

Fol 4 is left blank

రమాసౌందర్యమంజరి

RAMĀSAUNDARYAMANJARI

A eulogistic description of the various parts of the body of Lakṣmi, commencing with the feet, by Rāmayakavi

Complete in 25 stanzas

**Beginning.**

శా శ్రీమీఱంగఁ జెలంగు విశ్వమను రాజీవంబు కెంగేలను
ద్దామప్రౌఢిని దాల్చి దోర్ద్వయచతుష్కంభోల్లసద్విష్ణువ
క్షోమస్యస్థలమంటపాంతరముఁ గొల్వుండి క్రీడించు ని
న్నేమారుఁ మదిలోనఁ గల్పి కొలుతుఁ వేఘోండదీపాంకురా !

శా శ్రీకారాంచితశుక్తి మౌక్తికమణి శ్రీకంఠశుద్ధాంత కాం
తాకంజాతకరాగ్రకల్పిత కనత్పాత్రావర్ధికించిదా
లోకాంకూరకుబేర దాశ్రితతతీలోకైక సేవ్యాకృతీ
పాకద్వేషికిరీటదీధితిపరిభ్రాజత్పదాంభోరుహా !

**End**

మ అరవిందాలయ ! సర్వలోకజననీయాదోధిరాట్పుత్త్రి సుం
దర దివ్యాంబరకంచులీకనకరత్నప్రోతభూషాసము
త్కరసంశోభిని నిస్వతాపగళితధ్వాంతచ్ఛిదాకౌముదీ
హరిబాహాపరిరంభగుంభనసుఖవ్యాపారపారంగతా !

శా. కళ్యాణీ ! భవదీయసంస్తవము లోకంబందు నిత్యంబు సా
కల్యంబొప్పఁ బఠించువాఁ డఖిలసత్కామ్యార్థముల్ గాంచి మాం
గల్యాగారసుపుత్త్రపౌత్త్రతతిసంగం బొప్ప వర్ధిల్లి కై
వల్యంబుం దుదినొందు నీదు కరుణన్ వైకుంఠలోకేశ్వరీ !

మ హరిదివ్యాంఘ్రిసరోజభంభరితహృద్వ్యాపారుఁడన్ బండితా
దరణీయుండను రామయాహ్వయుఁడను ద్యద్భక్తి సౌందర్యమం
జరి నర్పించెద నీకు సత్కరుణమించన్ వేడ్కఁ గైకొమ్ము సా
గరరాజన్యకుమారికామణి కనత్కాంచీరణత్కింకిణీ !

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత తిన్నఁగా నున్నది తప్పు లంతగా లేవు శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

'రమా సౌందర్యమంజరి' యని పేరితో నిర్వది యైదుపద్యముల లోఁగల యీ స్తోత్ర గ్రంథమున లక్ష్మీదేవి వర్ణనముగలదు. పాదాదిగా, కేశాంతముగా లక్ష్మీదేవి సర్వాంగ సౌభాగ్యమిందు వర్ణితమైనది ఇది యేదేని సంస్కృత గ్రంథమునకు తెలుఁగయి యుండునేమో! ఈ గ్రంథము 'రామయకవి' రచియించెను ఆతనిఁగూర్చి విశేషము తెలియరావు.

---

## R No 764

Paper 10¾ × 9¾ inches Foll 16 Lines, 20 in a page Mode of writing, good Contains mistakes and omissions Good

Fol 16 is left blank

Transcribed in 1926–27 from a MS of M R Ry K Rudracharyulu, Chintalapalem, Singavarapukota post

రుద్రకవివిషయము

## RUDRAKAVIVISAYAMU

Contains several poems written by Rudrakavi of Kandukuru, and also some of the Samasyās completed by him and several incidents relating to his biography The MS under notice was transcribed from a Ms acquired from Mr Rudracharyulu a descendant of Rudrakavi

Complete.

పంచచామరములు

**Beginning**

అనాథనాథ నాగతల్ప యజ్ఞకల్పమానిరం
జనాజనార్తి నాశనాదిశాపరీవృఢార్ధశా
సనాసనాతనాయనాది సన్యకందుకూరి శ్రీ
జనార్దనా జనార్దనా ససాహసారిమర్దనా!

* * *

సుందరీమయాంగవామ శోభనానిరంజనా
స్యందనీకృతోర్విశైలజామనోభిరంజనా!

మందహాసభాసకంర మంజుభావితాంజనా
కందుకూరి సోమవిషకామదర్భభంజనా !

**End**

శ్రీమత్పరబ్రహ్మ సద్యోజాతముఖోద్భవ సానగగోత్రపవిత్ర జగజ్జేగీయమాన విద్వజ్జనస్తోత్రపాత్ర . సకలవేద శాస్త్రాలంకారనాటకాంత సంగీతసాహిత్యాద్యనేకమహావిద్యా విద్వత్కవితానిరాతంకకారణ జగద్గురుమహారాజ (రాజశ్రీ ?) రామేశ్వర విద్వత్కవి సింహాసనాంకోద్యత్పరస్వతీశిరస్యరుద్ర కవీంద్రాచార్యః అనియీ ప్రకారం రుద్రయ్యగారికి తాతయాచార్యులవారిచే నివ్వబడిన వకర్ణ శ్రీ ముఖం వ్రాయడమున కిచ్చినవారయిరి రాయతక్తసంస్థానమందు ప్రవర్తించడమయినది.

(వి-వి)—

సమగ్రము వ్రాంచే తిన్ననిది. తప్పులున్నవి శైథిల్యము లేదు. గ్రంథపాతములున్నవి

కందుకూరి రుద్రకవి రచించిన పద్యములు గొన్ని ఆయన చరిత్ర విషయము కొంత, ఇందుఁగలదు ఆయన పూరించిన సమస్యలు గొన్నిగలవు దీని మాతృక కందుకూరి రుద్రకవి గ్రామమగు చింతలపాలెమున నా కవివంశ పరంపరలోని వారి యొద్దనుండియే సేకరింపఁబడినది

---

R No 76[illegible].

Paper $10\frac{3}{4} \times 9\frac{1}{2}$ inches Foll 310 Lines, 20 in a page Mode of writing, good not free from mistakes Breaks off in many places Good

Fol 310 is left blank

Restored in 1926-27 from a MS presented by M R Ry Kandanuri Yajñayya, Leburu, Indukuripeta post, Nellore district

ద్విపదభాగవతము

DVIPADABHĀGAVATAMU

Same work as that described under R No 697 *ante* from which the MS under notice was restored For other particulars see the extracts given below

Contains up to the story relating to the King Prthu in the IV Skandha By Tēkumalla Rangasāyikavi

**Beginning**

ద్వి. శ్రీసత్యురుస్త నాంచితవరారుణవి
భాసూచక సరాగ పాదాబ్జతలుని

* * * *

మరకతాచల శృంగమహనీయదివస
కరసామ్య మాణిక్య ఖచితకోటీరు
ఘనునిఁగళ్యాణ వేంకటనాథుహృదయ
వనజ మధ్యమునఁగేవల భక్తినునిచి

* * * *

భవభూతి జయదేవ బాణమయూర
శివభద్ర భారవి శ్రీహర్షముఖ్య
కవుల సంస్కృత కావ్యకర్తృతాధికుల
సవినయోక్తిగణించి శబ్దశాసను ని

* * * *

ఘనసూరసుకవి భాస్కరుని శ్రీనాథు
సోముని భీమునిస్తుతియించి మఱియు
భూమినాంధ్ర కవిత్వమునఁ గీర్తిగన్న
చతురుల నెంచి వ్యాస ప్రోక్తభాగ
వతముతూ  చార్థైనపదవు పోనీక
యనమొప్ప . .
రసికుబమ్మెర పోతరాజు వర్ణించి
రామాయణంబు భారతము ద్విపద
లైమెఱఁజేసిన యలరంగనాథ
ధీరుబట్టిపాటి తిరుమలభట్టు
గారఁబ్రౌఢోక్తులు గలుగస్మరించి

* * * *

కావునలోకోప కారమాయత్న
మీవుచేసితివి మేలిదిమంచితలఁపు
వత్స ! నీద్విపదకావ్యము నాకువినఁగ
నుత్సవమయ్యె వేఱొకపురాణంబు
వలెఁగాదు శ్రీభాగవత

* * * *

ఎనలేని వేదర్థమమ్ములు వేల్పటఁచు
ననిశంబుగొలుచు విద్యానిధి పుప్ప

గిరితిమ్మ సుకృతి యీకృతికి సాహాయ్య
పరుఁడుగా సద్గ్రంథముల్ పదియును రెండు

* * * *

శ్రీధర్మపురి నాగసింహునికరుణ
శ్రీధనధాన్య సమృద్ధులుగలిగి
తేకుమళ్లాగ్రణి తిప్పయప్రభుఁడు
నీకునాలవతాత నెఱదాత వెలసె

* * * *

ఆమహామతి రామమాంబావధూటి
కామినియందు శ్రీకరగుణాధికుని
అనఘుమీ అప్పనామాత్యుఁ
గనియె వార్ధిసుధాంశుఁ గన్నచందమున
అప్పనామాత్యుఁ డింపలరబంగారు
కుప్పనార్థుల కోరికలిచ్చు
తప్పఁడాతఁడు భాషితము ప్రకృతంపుఁ
జొప్పనారతముఁ గాంచుచుఁ బ్రవర్తించు
ఆయప్పమంత్రి రుక్మాయిఁ బెండ్లాడి

* * * *

కాంచనాంబరుఁడుముక్ కొంచెనరహిన
మంచితోదారు రామయధీరుఁ గనియె

* * * *

ఆరామమంత్రి సీతాంగనఁబోలు
నారూఢశీల సీతాంబవరించి
కరుణాగుణౌన్నత్యుఁ గప్పరామాత్య
నరసింహు నరసమానళినాక్షుఁగనియె
అందుఁగప్పరమంత్రి యనవద్యబుద్ధి
నిందితసుర . . . విదుండు

* * * *

భూవినుతైశ్వర్యములఁ బొసంగితివి
తిరువళ్ళూరిపురాధిపుఁడైశుభంబు
కరుణించు వీరరాఘవుని పేరిటను
శతకంబుకృష్ణరాజద్దండకంబు
ప్రతిలేని జానకీపరిణయయక్ష

గానంబు          రిటునగీర్తనలు
సరసతరమైయొప్పు సకలశాస్త్రములు
వర సారములు గూర్చి వాణీపురస
వనమాలికాఖ్య కావ్యమునొనర్చితివి
జననుతుండవు రంగశాయి మంత్రీంద్ర

*          *          *          *

ఈకృతి శ్రీవేంకటేశునకొసంగి
చేకొమ్ముశాశ్వత శ్రీకీర్తులెసగ

*          *          *          *

అనిపలికినా డ యనుమానపడక
సనయుండు మత్సహశ్రోతయున్నైన
గిరిధైర్యనిధి పుష్పగిరితిప్పనార్య
వరునిసుపుత్త్రు విశ్వామిత్రగోత్రు
ఆశ్వలాయన సూత్రునననఘచారిత్రు
సార్థసంప్రాప్త
చారుకవిత్వ సుజ్ఞానరహస్య
పారజ్ఞుఁదిమ్మన సత్కవిఁబిలిచి
అతనిసహాయతనతులోక్తియుక్తి
చతురత్వశాలినై సంతతానంద

*          *          *          *

శంకరస్తుతమహాస్తుతికిఁగళ్యాణ
వేంకటపతికిఁ గోటిదజనాదృతికి
అర్పితంబుగ సముద్యద్భక్తి నేనొ
నర్పఁబూనిన మహోన్నత భాగవతపు
ద్విపదకావ్యమునకు . . .

**Colophon**

శతకోటిరవివిభాశ్రయణీయుపేర
శతకోటి ధరముఖస్తవనీయుపేర
కల్యాణమయ శుభంకరవాసుపేర
కల్యాణ వేంకటనగనివాసుపేర
అంకితంబుగఁ దత్పదాంబుజధ్యాన
సంకీర్తనాది నిశ్చలభక్తితత్త్వ
వనజాత భాసరవాణీవిలాస

వనమాలికాకృతివరవినిర్మాణ
బంధురశేముషీ పాండిత్యసత్య
సంధానభాషా ప్రసంగప్రవీణ
గురుతరశ్రీవత్స గోత్రపవిత్ర
పరమవిద్వన్నుతాపస్తంబసూత్ర
మహితవైభవ తేఁకుమళ్లాఖ్యవంశ
మహనీయకప్ప రామాత్యసత్పుత్త్రి
ఘనతిమ్మ మాగర్భకలశాబ్ధిచంద్ర
జననుత శ్రీరంగశాయి ప్రణీత
పరమభాగవత ద్విపదమహాకావ్య
మునఁదృతీయస్కంధము సమాప్తమయ్యె
గిరిధైర్యుఁడగు పుప్పగిరి తిమ్మసుకవి
వరుఁడు సహాయుఁడై
హరువైన యీకావ్యమార్యసంస్తవ్య
తరముర్వినాచంద్రతారమౌఁగాక

End

వినిపించు ఘనుఁడొందు విష్ణుపదంబు
అని ఫలశ్రుతి చెప్పి యవ్విదురునకు
ఘనుఁడు మైత్రేయుండు క్రమ్మఱఁబలికె
వర్చస్వి

(వి-వి)—

అసమగ్రము నాల్గవస్కంధమున పృథుచరిత్రము తుదివఱకుఁ గలదు వ్రాఁతఁతిన్ననిది తప్పులంతగాలేవు శైథిల్యములేదు గ్రంథపాతములు మిక్కిలి హెచ్చు—ఇది ఆర్. నె 697 రు మాతృకనుబట్టి వ్రాయఁబడినదే

బమ్మెరపోతరాజుగారి పద్యభాగవతము ననుసరించిరచియింపఁబడిన యీ ప్రశస్తద్విపద రచనము, కోనేరు నాథునిరచనముకంటె వేఱయినది. కోనేరు నాథుని రచనము సంగ్రహమై విశిష్టాద్వైత సిద్ధాంతమనుబట్టి యున్నది ఇదిసరిగా పోతరాజుగారి గ్రంథము ననుసరించి యున్నది. గ్రంథకర్త తేఁకుమళ్ల రంగశాయికవి ఈతఁడు వీరరాఘవ శతకము, కృష్ణదండకము, జానకీపరిణయయక్షగానము, వాణీవిలాస వనమాలిక, యనుకృతులను గూడరచియించెనఁట ! వాణీ విలాస

వనమాలిక యీ పుస్తకశాలలోఁ గలదు ఈతఁడు ప్రాచీనకవిస్తుతిలో రంగనాథుఁడును, బల్లెపాటి తిరుమలభట్టును, రామాయణమును, భారతమును తెనుగున ద్విపద కృతులుగా రచించిరని పొగడెను పుష్పగిరి తిమ్మకవి తనకీ గ్రంథమును రచియించుటలో సహాయపడెనని, కర్త్యావతరణికలోను, సర్గాంతములందును. ఈతఁడు చెప్పుకొనెను రంగశాయికవి కాతఁడు ‘సహశ్రోత’ యట! ఇదే విధము కంకంటి పాపరాజు న త్తరరామాయణమునను గలదు గంగశాయికవి శ్రీవత్సగోత్రుఁడు తిమ్మనకు, కృష్ణరామామాత్యునకుఁ గొడుకు ఈ కృతి తిరుపతి వేంకటేశ్వరస్వామి కర్పితము ఈ కవియు, కోనేరు నాథకవియుఁగాక తరిగొండ వేంగమాంబకూడ భాగవతము నిట్లు ద్విపద కృతిగా రచియించెను.

---

## R No 766

Substance, paper Size, 10⅜ × 9⅛ inches Foll 44 Lines, 20 in a page Mode of writing, not good, Full of mistakes and breaks off in some places Good

Restored in the year 1926-27 from a MS of the Government Oriental MSS Library, Madras

Foll 1 a-42 a Foll 42 *b*-44 *b* are left blank

లక్షణరాజీయము

LAKSANARĀJĪYAMU

This is apparently a compilation of verses from various works on Telugu prosody In copying the MS under notice, the scribe has omitted the definitions and examples of Bandhakavitva though they are found in the original

Incomplete (without beginning and end)

**Beginning**

అష్టగణములకు లక్షణము.

మగణానికి

సీ వసుధ దైవము బుధవారము త్రిగురువు
లగును శ్రీసాంబాయనఁ గమగణము
సంపంగిపూల వచ్చని చేల నాచాయ
నమరు వృశ్చికరాశి యసురగణము
శూద్రజాతి రసంబు రౌద్రంబు షడ్గరి
కర్ణ జ్యేష్ఠ ప్రాగయోని మగధదేశ
ప్రణవస్వరూపంబు భూతగణమువచ్చు యేకస్వ(శ్వ ?)
పాస్వయమును శుభంబులందు గంధ.

మతఁడు పురుషుండు తామసమగు గుణంబు
శంఖచక్రారి వహ్నిలోచన జననము
గణములకుఁ దాతకృతికర్త గ్రహము బుధుఁడు
విదితగుణకోశ శ్రీశ శ్రీ వెంకటేశ ౹

**End :**

సీ॥ చాకపుటింగ్లీడ చాకంబుగా నాలు
గిడి బాహ్యకోణముల్ ముడిదనర్చి
లోవెలిమూలలు లోనిమూలలు వెలు
పటిమూలలకును బరవుగాఁగ
మెలివడగలపి పైమలకపై బడగలు
క్రిందటి మలకఘుక్రింద పుచ్చ
యుగ్మంబువెనవేసి యొగినిరుప్రక్కల
మలకలపై అర్ధమండలములు

గలపపడగ క్రిందిమలక క్రిందాదిగై
గ్రంథినొకటి వొకటి సంధిచు
రెండుమండలముల రెండు వ్రాల్కొననొండు
వలయు మఱిద్వి నాగబంధమునకు

(వి-వి)—

అసమగ్రము ఆద్యంతములు లేవు వ్రాఁత మంచిది గాదు. తప్పుల కుప్ప శైథిల్యము లేదు. గ్రంథపాతము లల్పముగా గలవు

నానా చందోగ్రంథములనుండి యెత్తిన పద్యము లిందుఁగలవు. కాని యిది యేక కర్తృకముగాదు. ఇందలి పద్యములు పెక్కులు 'వెంకటేశ' యని మకుటముగలవి గణపవరపు వెంకటకవి లక్షణశిరోమణి వేంకటేశ్వరాంకితమే ఇదియందలి భాగమైనను గావచ్చును శుభాశుభగణములు తదధిదేవతలు, పద్యలక్షణము, యతిప్రాస లక్షణములు, బంధకవిత్వ లక్షణములు నిందుఁగలవు. దీని మాతృకలో బంధకవిత్వ లక్షణము, రేఖావిన్యాసముతో సోదాహరణముగానుండగా నిందు వి లేఖకుఁడు దానిని వ్రాయక వదలిపెట్టినాఁడు

## R No 767

Substance, palm-leaf Size, 15⅜ × 1½ inches Pages, 26 Lines, 6 on a page Mode of writing, not bad Condition injured

Presented in the year 1927–28 by the Mahārājah of Pithāpuram

బసవలింగశతకము.

BASAVALINGAŚATAKAMU

Written in praise of Basavēśvara, one of the propounders of Vīraśaiva system The name of the author is not known

Incomplete Contains 97 stanzas from the beginning

**Beginning :**

సీ. శ్రీగురులింగ సంచితకృపాయత తేజ
కామితాఖిలలోక కల్పభూజ
మానితశివమంత్ర మానససందీప
సహజప్రసన్న
విధాన
ఘనవీరశైవ మార్గస్వలీన
వరభక్తిసుజ్ఞాన వైరాగ్యసుక్షేమ
సకలసన్నుత గుణసార్వభౌమ

చెలఁగి భవదాజ్ఞ . .
. పాలింపుమయ్య
కలితసజ్జనహృత్సంగ కారణాంగ
పటుదయాపాంగ ! శ్రీగురుబసవలింగ !

సీ వీరమాహేశ్వరాచార వర్ధనుఁడైన
వేమనారాధ్యుల వినుతిచేసి
పరవాదులనుమట్టుపఱచిన యార్ధ్వలో
చనుపండితారాధ్యులను భజించి
బసవపురాణమేర్పరచిన పాలుకు
రికి సోమనారాధ్యులకునుమ్రొక్కి
చెలఁగిదీక్షాబోధ చెప్పిన పిడుపర్తి
బసవనారాధ్యులఁ బ్రస్తుతించి.

మఱియు శివకవిగణములకెఱఁగి వారి
కరుణమీపాదపద్మముల్ గంటిఁబోగడ
కలితసజ్జన హృత్సంగకారణాంగ
పటుదయాపాంగ శ్రీగురుబసవలింగ!

**End**

సీ సహజలింగాంగ నిష్ఠాపరవశులైన
    వారునావారు నేవారివాఁడ
వీరశైవాచార సారవర్తనులైన
    వారునావారు నేవారివాఁడ
పరశివభక్తి సామ్రాజ్యవర్ధనులైన
    వారునావాడు నేవారివాఁడ
మహితపంచాక్షరీ మంత్రాభిముఖులైన
    వారునావారు నేవారివాఁడ

నను చుభక్తులే గతిమతియని చుంచుఁగొలుచు
చుండు పుణ్యుని సేవనాకొసంగుమయ్య
కలిత

సీ గురువులందు గుణావగుణము లెంచఁగఁబోదు
    నీదోషవృత్తి నాకెపుడుతొలఁగు
శివదూషణంబులు చెవులొగ్గివినఁబోదు
    నీపాపబుద్ధి నాకెపుడువీడు
జంగమావళికుల జాతులెన్నఁగఁబోదు.

(వి-వి)—

అసమగ్రము. ఆదినుండి 97 పద్యమున కొంతదాఁకఁగలదు 2, 3 సంఖ్యల యాకులు లేవు శైథిల్యము గ్రంథపాతములు హెచ్చుగాఁ గలవు

కలిత సజ్జనహృత్సంగకారణాంగ! పటుదయాపాంగ! శ్రీగురు బసవలింగ! యని మకుటముగల యీ సీసపద్యశతకము వీరశైవమత ప్రవర్తకుఁడగు బసవేశ్వరుని తదభిన్నునిగా శివుని స్తుతించునదిగా నున్నది గ్రంథకర్త పేరిందుఁ గానరాదు.

## R No 768

Substance, palm leaf  Size, 16½ × 1⅜ inches  Pages, 5  Lines, 9 on a page  Mode of writing, fair but not quite free from mistakes  Much injured

Presented in the year 1927–28 by the Mahārāja of Pithāpuram

మహాభారతము

MAHABHĀRATAMU

Same work as that described under No 185 of the Telugu Descriptive Catalogue

Incomplete  Contains Mausala Mahāprasthānika and Svargarōhana parvas

(వి-వి)—

అసమగ్రము మౌసల మహాప్రస్థానిక స్వర్గారోహణ పర్వములు గలవు వ్రాత మంచిది తప్పులంతగా గానరావు శైథిల్యము గ్రంథపాతములు చాల హెచ్చు

ఇది డి 185 రున వర్ణితమైనదే

---

## R No 769

Substance, palm-leaf  Size, 11 × 1½ inches  Pages, 518  Lines, 5 on a page  Mode of writing, fair and almost free from mistakes  Slightly injured

Presented in the year 1927–28 by the Mahārāja of Pithapuram

నలచరిత్రము

NALACARITRAMU

Same work as that described under R No 145 *ante*

Wants one leaf in the beginning otherwise complete

(వి-వి)—

సమగ్రము వ్రాత మంచిది. తప్పులంతగా లేవు శైథిల్యము గ్రంథపాతములు అంతగా లేవు కాని గ్రంథారంభమున నొక యాకు పోయినది.

ఇది ఆర్. నె 145 రున వర్ణితమైనది.

R No **770**

Substarce, palm leaf Size, 15 × 1¾ inches Pages, 22 Lines, 6 on a page Mode of writing, good but not quite free from mistakes Injured

Presented in the year 1927–28 by the Mahārajah of Pithapuram

సీతాకళ్యాణము

SĪTĀKALYANAMU

Begins on fol 1a

The story of the marriage of Sīta is written in the form of Yaksa-gana and dedicated to Gōpālaswami worshipped at Pāmūru in the Nellore District The name of the author is not known

Incomplete

**Beginning** —

సీ. సిరిచెలు వలరునంచిత సూర్యవంశాబ్ధి
చంద్రుడౌ దశరథ జనపతికిని
కౌసల్యకును శుభకలితుండై జనియించి
కౌశికమౌని ---గంబు గాచి
సర్వజ్ఞు విలువంచి జనకుని మెప్పించి
సీతను వరియించి చెలువుగాంచి
పరశురాముని భంగపఱిచి యయోధ్యకు
. ంచి సమ్మతముగాంచి
సీతతోఁగూడి పట్టాభిషేకమంది
వెలసి నిలిచిన శ్రీమహావిష్ణుమూర్తి
చారుతరమూర్తి శ్రీరామచక్రవర్తి
సిరులుదయచేసి మమ్ము రక్షించుఁగాక !

అట తాళము.

జగములకు తలిదండ్రులనుచును సకల జనులు,
పొగడ, దగిన సీతారామచంద్రుల దలఁతు నెపుడున్
జనకుడును దశరథుడు తమగని సంభ్రమమ్మున, జెలగగ
దనరు సీతారామచంద్రులఁ దలఁతు నెపుడున్
తలఁచు కోరిక భక్తజనులకుఁ కలుగఁజేసి-మనమున
నిలుచు సీతారామచంద్రులఁ దలఁతు నెపుడున్

* * * *

దీనమందారునకు దేవతాధారునకు
జానకీరమణునకు సకలశరణునకు
పామూరి మదన గోపాలుడై భక్తులకు
కామితములొసగు శ్రీ రామచంద్రునకు

**End**

రూపకం.

జిలుగు బంగరునిండు జలతరు
చీరకుచ్చులు మెఱయఁగా
నలుపు వన్నియపట్టు రవికకు
కొలికి ముత్తెము చెలగగా
వచ్చె నెఱుకతహో!
వచ్చె నెఱుకత రాజ వీధిని
మెచ్చుచును ప్రజవచ్చి చూడగ
వచ్చువిల్తుని సానదీరిద
బాణమోయని భ్రమయగా
వచ్చె నెఱుక తహో!
గలగలను మొలచూని గంటలు
గిలుకుటందెలు మొరయఁగా
ఒలయునీలపు ౹ జాలుచు సంకు
టుంగరంబులు మెఱయఁగా
వచ్చె నెఱుక తహో!
చిలుక తాళియుఁ గంకణంబులు
చెలఁగు దంతపుఁ గమ్మలుఁ
వెలయు ముత్తెపు సరులు గవ్వల
పేరులల్లల నాడఁగా
వచ్చె నెఱుక తహో!

వి-వి )——

అసమగ్రము వ్రాఁత మంచిది తప్పులంతగా లేవు శైథిల్యము గ్రంథపాతములు గలవు.

సీతా వివాహకథావర్ణనాత్మకమైన యీ యక్షగానమునకుఁ గర్త యెవరో తెలియదు. పామూరి గోపాలస్వామికి కృతిసమర్పింపఁ బడినది. పామూరు నెల్లూరు మండలమునఁగలదు

రుక్మాంగద చరిత్రము

RUKMĀNGADA CARITRAMU

Begins on fol 12 a

Same work as that described under R Nos 128 and 719 ante

Incomplete

(వి-వి)—

అసమగ్రము వ్రాంత మంచిది తప్పులంతగా లేవు శైథిల్యము గ్రంథపాతములు లేవు

ఇది ఆర్ నె 128 రు, డి 719 రుల వర్ణితమైనదే

---

## R No 771.

Palm-leaf 15½ × 1 inches Pages 338 Lines, 5 on a page Mode of writing good but not quite free from mistakes Fair

Presented in the year 1927–28 by the Mahārāja of Pithāpuram

(ఎ) నిర్వచనోత్తర రామాయణము.

NIRVACANŌTTARARĀMAYANAMU

Foll (1)*a*—169 (*b*)

Same work as that described under No 2 of the Descriptive Catalogue Vol I Contains also the 11th Āsvāsa written by Jayanti Rāmabhattaraka

Comple

(వి-వి)—

సమగ్రము వ్రాత మంచిది తప్పులున్నవి శైథిల్యము గ్రంథపాతములు లేవు

జయంతి రామభట్టారకుండు రచియించిన యేకాదశాశ్వాసము కూడనిందుంగలదు

ఇది డి. నె 2 రున వర్ణితమైనదే

(బి) మహాభారతము స్వర్గారోహణ పర్వము.

MAHĀBHĀRATAMU SVARGĀRŌHANAPARVAMU

Foll 170*a*

Same work as that described under No 185 of the Descriptive Catalogue

Incomplete

(వి-వి)—

అసమగ్రము స్వర్గారోహణ పర్వము మాత్రము సమగ్రముగాఁ గలదు వ్రాఁతమంచిది తప్పులంతగా లేవు శైథిల్యము గ్రంథపాతములు లేవు

ఇది ప. నె 185 రున వర్ణితమైనదే

(సి) యామునాచార్య చరిత్రము

YĀMUNĀCARYACARITRAMU

Begins on fol 187 *a*

Same work as that described under R No 220 ante

Incomplete

(వి-వి)—

అసమగ్రము వ్రాఁత తిన్ననిది తప్పులంతగా లేవు శైథిల్యము గ్రంథపాతములు లేవు

ఇది ఆర్ నె 220 రున వర్ణితమైనదే

---

## R No 772.

Palm-leaf 14½ × 1 inches Pages 28 Lines, 5 on a page Mode of writing fair and free from mistakes Condition injured

Presented in the year 1927-28 By the Mahārāja of Pithapuram

రమారమణ శతకము

RAMĀRAMANAŚATAKAMU

Written in praise of God Visnu By Krsnamarāju, son of Vaddādi Krsnamarāju

Complete in 108 stanzas

**Beginning**

ఉ విందగుతావి నొప్పునరవింద మరంద మమందరక్తినిం
దిందిర బృందమాని చెడదియ్య, దిభేంద్రము పద్మమాడ్చి త
ద్బిందువు గ్రోలలేదు. మృదుభీషణ వర్యుల కార్యమిట్టిదా
కెందును జూడవో త్రిజగదీశ రమారమణా లసద్గుణా

చ కనికరమింత లేక ధనకాంక్షన మాన ధరామరావన నీ
ఘన ఫలమక్ర          వైకొను దుష్టచరిత్రుఁడెట్లు స
జ్జనుఁడగు దంభకృత్యముల సాధువిధేయుని రీతిఁ గంటికిఁ
గనుపడుఁ గాని నీల ఘనకాయ రమారమణా లసద్గుణా

End

ఉ మోదముతోడ నీ శతకముఖ్యముఁ జెప్పిన వాఁడ నేను వ
డ్డాదికులోద్భవుండ సుజనాప్తుఁడఁ గృష్ణమరాజపుత్త్రుఁడఁ
నీదయఁ గోరువాఁడ ధరణీవర కృష్ణమరాజ నాముఁడఁ
సాదర దృష్టిఁజూడు నను సామి రమారమణా ! లసద్గుణా !

* * * *

ఉ. శ్రీరమణీయ దేవముని సేవిత పాదపయోజ యుగ్మదు
ర్వారనిశాచర ప్రకట వారణ కారణ ధారణా కన
ద్వారిచరాది రూప విభవా ! భవదీయ దయామదీయ ప

* * * *

(వి-వి.)—

సమగ్రము 108 పద్యములున్నవి. వ్రాఁత మంచిది తప్పులు లేవు ఎలిక కొఱుకుటచే ఆకులు కొంతపట్టుపోయినవి. కాన శైథిల్యము గ్రంధపాతములు హెచ్చు

"రమారమణాలసద్గుణా !" అను మకుటముగల యీ చంపకోత్పలమాలి కావృత్త శతకము విష్ణుస్తుత్యాత్మకము వడ్డాది కృష్ణమరాజు కుమారుఁడగు కృష్ణమరాజు దీనికిఁగర్త

---

## R No 773.

Substance, palm-leaf 11×1 inches Pages 74 Lines 6 on a page Mode of writing good and almost free from mistakes Condition uninjured Presented in the year 1927–28 by the Mahārājah of Pithāpuram

సంగీత శిక్ష.

SANGITAŚIKSA

A manual of indian music for beginners containing songs composed by Tyagaraja, Vijayarāghavarāya and others

Complete

**Beginning.**

ప్రథమ శిక్షా ప్రకరణము

తొలుదొలుత సంగీత శాస్త్రము నభ్యసించు క్రమము

మాళవగౌళ రాగము—ఆది తాళము

అక్షరి ప్రథమ కాలము ఆరోహి అవరోహి

సరిగమపధనిస సనిధపమగరిస

చతురశ్రజాతి వరుసలు—

సరిగమ, సరిగమ, సరిగమ, పదనిస,
సనిదప, సనిధప, సనిధప, మగరిస,

* * * *

వినాయక గీతములు—గీతములు పాడవలసిన క్రమం

మలహారి రాగము—రూపక తాళము

మపధససరి । రిసధపమప । రిమపధమప ।
శ్రీగణనథ । సిందురవర్ణ కరుణ సగర ।
ధపమగరిస । సారిమగరి । సరిగరిస ।
కరివదన । లంబోదర । లకుమికర ।
రిమపదమప । ధపమగరిస । సారిమగరి ।
అంబసుత । అమరవినుత । లంబోదర ।
సరిగరిసా
లకుమికరా

**End:**

ఆనందభైరవి రాగం—త్రిపుట తాళం

అ॥ భామరో పూరికి బయలుదేరెటివ్యాళ
ప్రేమమీరినసామి పిలిచి చెప్పినమాట,
పల్ల॥ ఏమాని తెలుపూదు, ఏలాగు తాళూదు,
ఏమీసేతునె చెలియా ।

* * * *

నిడివికన్నులనీరు నింపుచుతలయూచి
తడలేక వేగమె తానేవద్దికివచ్చి
అడుగడు గూకు వుసు రసురానితలయూచి

కడు మోహమున ప్రాణ
కాంతుఁడాడినమాట,
ఏనోమునోచితి ఏలాఁగు వేడితి
తానే మోవ్రాసేనని తలమీది విధియని
పూనీమామువ్వగో,
పాలాస్వామి సూనశరుఁ కేళి
సుఖించామనిన మాట——
ఏమాని తెలుపూదు

(వి-వి)——

సమగ్రము వ్రాఁత చక్కనిది తప్పులంతగా లేవు శైథిల్యము గ్రంథపాతములు లేవు.

సంగీత విద్యనేర్చుకొను విద్యార్థులు అభ్యసింపవలసిన స్వరములు, జంటస్వరములు, అలంకారములు, గీతములు, కృతులు క్రమముగా నిందు గొన్ని కలవు. త్యాగరాజ కృతులు కొన్ని గలవు ఇతరుల కృతులు కొన్ని గలవు మువ్వ గోపాలపదములు గలవు విజయరాఘవరాయలు మొదలగు వారిమీది కీర్తనలును గలవు సంగీత విద్యార్థుల పూర్వ విద్యాభ్యాస పద్ధతినిది గొంత తెలుపును

---

R No **774**

Palm-leaf 15¼ × 1½ inches Foll 19 Lines, 5 on a page Mode of writing, not bad but not free from mistakes Condition, injured Presented in the year 1927–28 by the Mahārājah of Pithapuram

ఉత్తర గోపుర కథ పట్టు.

UTTARA GŌPURA KATHA PATTU

Foll 1*a*—7*b*

Same work as that described under No 1396 of the Descriptive Catalogue.

Complete

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత యొకమాదిరిగానున్నది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది డి. నె 1396 రున వర్ణితమైనదే.

## మత్స్యపురాధినాయక శతకము

## MATSYAPURĀDHINĀYAKA ŚATAKAMU

Foll 80—195

A centum of stanzas in praise of God Visnu worshipped at Matsyapura - By Meduri Anantadasa

Complete

**Beginning**

ఉ. శ్రీయదువంశ దీప మునిసేవిత సర్వజగన్నివాసకం
జాయతపత్రనేత్ర శరణాగతరక్ష మహానుభావ నీ
పాయకతల్పువారలకు భాగ్యములిచ్చును గాక దుర్విచా
రాయతులైనవారలకు నిచ్చునె మత్స్యపురాధినాయకా!

ఉ. కాయమునిత్యమంచుఁ గడగానక యల్పులు బుద్ధిమాలి నీ
మాయకుఁ జిక్కి దుర్గుణము మానఁగలేక మదాంధులైదుర
న్యాయము లేతలంచి కలనైనను సత్యముపల్కఁజాలరా
రాయిదియుక్తముల్ పలుకరాదుగ మత్స్యపురాధినాయకా'

**End.**

ఉ ఈశతకంబు తప్పులు సుధీశ్వరులెవ్వరు చిత్తగించి యే
దేశమునందునైన నవధీరితుఁజేయఁగవద్దు, పెద్దలకా
వాసియొసంగ. వ్యర్థములాడిన యల్పజాతికిన్
జేసిన నీతివాక్యములు సిద్ధము మత్స్యపురాధినాయకా!

ఉ శ్రీరమణీయసత్కృపను జెల్వుగ నీశతకంబుధాత్రిమే
దూరియనంతదాసుఁడిరవొందఁగనుత్పలచంపకంబులన్
గూరిమితో రచించియొసఁగూర్చెను శిష్టజనంబులార మీ
భూరిపదాబ్జయుగ్మములు పొందుగ నాశిరమందునుంచి నా
నేరము లెంచకేమిగుల నెమ్మదిఁబ్రోవరె సంతతంబునన్!

(వి-వి.)—

సమగ్రము ప్రాఁత యొకమాదిరిగానున్నది. తప్పులున్నవి.
శైథిల్యము గ్రంధపాతములు గలవు

మత్స్యపురాధినాయకా అని మకుటముగల విష్ణుస్తుత్యాత్మకమయిన
యీ చంపకోత్పల శతకము మేడూరి అనంతదాసుఁడు రచించినది.

## R No 775

Palm-leaf 17¼ × 1⅞ inches Foll 102 Lines, 5 on a page Mode of writing good and free from mistakes Good

Presented in the year 1927–28 by the Maharajah of Pithapuram

కృష్ణార్జునీయము

### KRIŚNĀRJUNĪYAM

A rendering into Telugu poetry of the Sanskrit Bhagavadgīta, by Mikkili Mallikarjunakavi who made the rendering at the instance of Pāpayamantri of Linganaparti and dedicated it to Śrī Rama worshipped at Linganaparti The author of this work has also written Rāmacandrōpākhyāna at the instance of Papayamantri

Complete

**Beginning**

శా. శ్రీ సీతాచపలామనోహరరుచిశ్లిష్టంబు భక్తానుకం
పాసారంబుఝరీప్రపూర్ణతరమున్ భాస్వచ్ఛరాసేంద్రబా
ణాసంబుద్ధులపాపయార్య హృదయోద్యచ్ఛాతకాహ్లాసదం
వాసంబున్నతరామమేఘము కృపం బాలించులోకంబులన్.

* * * *

సీ. గీ భాసురామరలోకంబుపగిదిఁదనరు
గురుతరాశేషసంపదాకరము విమల
విపులజలతృణకాష్ఠాభివృద్ధికరము
భువిని లింగమపర్తి యన్పురవరంబు.

గీ ఆపురమ్మున నివసించుఁగాపురముగ
మాధవపదారవింద సన్మధుకరాయ
మానమానసుఁడు డుతలమహితవంశ
సలిలరుహాపాళి పాపయసచివమాళి

శా. ఏ పుణ్యాత్ముఁడు గద్యపద్యఘటనాహ్వాద్యంబు శ్రీరామచం
ద్రోపాఖ్యానము తత్ప్రతిష్ఠితుఁడు పుణ్యుండుర్విజాభర్తకుం
దీపారన్మము భూమిదానధన సంతృప్తాత్ములం జేసి మేల్
దీపింపంగురు భక్తిపూర్వముగ నర్పించెనత్యున్నతిన్.[2]

గీ. భవిడిపల్లికులీనుండు ప్రబలుఁడైన
వేంకటాభిఖ్యకవి చేత విరచితంబు
శేషధర్మాఖ్యకృతిని విభూషణముగ
రాఘవేంద్రునకిప్పించె నే ఘనుండు.

సీ. పరమధన్యుండు రఘుపతిరాజు రవితేజుఁ
డనఘుఁడే సచివ చంద్రుఁడనకుఁ డంద్రి
సాధ్వీమణియనఁగ జననుతిఁ గాంచిన
రమణాంబయే గుణాకారశతల్లి
భూరిసద్గుణరత్నభూషణయై యొంచు
కామాంబయే మహాఘనునిభార్య
గుణరత్నధుర్యతఁ గొమరొందుఁ బాల
రామాఖ్యలేమంత్రి రాజకొమరు
లనఘగుణాసీత యేమంత్రి తనయయుడత
లాన్వయాయమహోజ్వలశాంబురాశి
సోముఁడనిక వినుతులొసఁ సుగుణుఁడలరు
సత్తిపాపయమంత్రి యొక్కవసరమున

చ. అసదృశరామపాదయుగళాంబుయజాభ్రమరాయమాణమా
నసునిసరస్వతీసుకరుణాపరిలబ్ధమనోజ్ఞమంజువా
గ్రసభరితోల్లసత్కదళికాఫలరాజసమానసత్కవి
త్వసరసతావిలాసు నతిధన్యుని మిక్కిలిమల్లికార్జునున్

* * * *

క. భగవద్గీతా శాస్త్రం
బగునే తాదృశమనంగ నతిగుహ్యమనం
దగుమీసుకృతము ఫలితం
బగునది తెనిఁగించనైరి మున్నేకవులున్.

క. కావునభవదీయవచః
ప్రావీణ్యము తేజరిలఁగఁ బ్రతిపద్యంబున్
భావించి తెనింగింపుఁడు
పావనగీతామృతంబు పండితులలరన్

గీ. అతులు చెలిఁగించి పిదపఁ గృష్ణార్జునీయ
మనెడుపేరఁ దనర్చునయ్యాంధ్ర కావ్య
మతులభక్తిని మత్ప్రతిష్ఠిత ధరాసు
తాధినాథున కర్పింపుఁడాదరమున

* * * *

క. శ్రీలింగమపత్రిపురీ
పాలునకును బాపయార్య పట్టాభ్యాత్కమూద

ప్రాలేయకిరణజాలున
కాలలితసుశీలునకు దయాలోలునకున్.

వ సమర్పితంబుగా నా యొనర్పంబూనిన కృష్ణార్జునీయంబను పేరంగల గ్రంథంబునకుం గథాక్రమం బెట్టిదనిన,

శ్లో॥ ధర్మక్షేత్రే కురుక్షేత్రే
సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ
కిమకుర్వత సంజయ

క శ్రీనిఖిల ధర్మమూలం
బైన కురుక్షేత్రమునం బృథాత్మజకుంతీ
సూనులుగముల్లై సమరే
చ్ఛానుగతిం జలిపిరెద్ది సంజయ! చెపుమా।
సంజయ ఉవాచ

శ్లో॥ దృష్ట్వాతు పాండవానీకం
వ్యూఢం దుర్యోధనస్తదా।
ఆచార్య ముపసంగమ్య
రాజావచనమబ్రవీత్

క అనినని సంజయుండి
ట్లనియె సుయోధనుడు పాండవానీకంబుం
గనియాచార్యుని కడకుం
జనియిట్లని విన్నవించె సంతసమొప్పన్

**End**

శ్లో॥ ఇత్యహం వాసుదేవస్య పార్థస్యచ మహాత్మనః
సంవాద మిమమశ్రౌష మద్భుతం రోమహర్షణమ్
వ్యాసప్రసాదాచ్ఛ్రుతవా నేతద్గుహ్యమహంపరమ్
యోగంయోగేశ్వరాత్కృష్ణా త్సాక్షాత్కథయతస్స్వయమ్।
రాజన్సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమ మద్భుతమ్
కేశవార్జునయోః పుణ్యం హృష్యామిచ ముహుర్ముహుః
తచ్చ సంస్మృత్య సంస్మృత్యరూప మత్యద్భుతంహరేః
విస్మయోమేమహా న్రాజ హృష్యామిచపునఃపునః

ఉ అత్తఱిసంజయుండనియెనద్భుతమైనముంగడు రోమహర్షణం
బుత్తమమౌ యదూద్వహ కురూద్వహసంవాదముబింటిఁబిమ్మటన్

దత్తదశేష చిత్ర సహితంబగు శ్రీహరి విశ్వరూపముం
బత్తిదలిర్పఁగంటిని నృపాలకవ్యాసమునింద్రు సతకృపన్

శ్లో॥ యత్రయోగేశ్వరః కృష్ణోయత్రపార్థోదనుర్ధరః
తత్రశ్రీర్విజయోభూతిర్ధ్రువానీతిర్మతిర్మమ

క. ఏయెడయోగీశుఁడు నా
రాయణుఁడు దనుర్ధరుఁడగు నర్జునుఁడును వా
లాయముగ నుండునచ్చట
శ్రీయును విజయంబుభూతి సిద్ధంబధిపా.

మ ధరణీనాథ సమూహభాసుర శిరస్త్రాణాగ్రకోటీరవి
స్ఫురితానేకమణిప్రభాస్పద పదాంభోజాతభూపుత్రికా
గురువక్షోరుహకుంకుమాంకితసువక్షో భాగ బక్త్రోల్లస
త్కరుణా లింగమవర్తి సత్పురనిశాంతా రామదేవోత్తమా।

మాలిని

సరసిజమృదుపాదా సామవేదాంత మోదా
నిరుపమగుణపూతానిర్జితారాతిజాతా
పరమసమరకేళీ భానువంశాబ్ధిహేళీ
పరకరుణ సుశీలా పాపయామాత్యపాలా.

**Colophon**

ఇది శ్రీరఘురామ పదారవింద మకరందరస పానమధుకరాయ మాన మానసశారదానుగ్రహకటాక్ష ప్రసారలబ్ధ సరసకవితాధురీధురంధర మల్లికార్జునపౌత్ర వేంకటనాయకతనూభవ మల్లికార్జున యశోధారేయ మిక్కిలి మల్లికార్జున నామధేయ ప్రణీతంబైన కృష్ణార్జునీయంబను కావ్యంబునందు ప్రకృతి పురుషవివేక గుణత్రయ విభాగ పురాణ పురుషోత్తమ దైవాసుర సంపద్విభాగ శ్రద్ధాత్రయవిభాగ సకలోపనిషదర్థ ప్రతిపాదక మోక్షయోగంబులుగల సర్వంబును ద్వితీయాశ్వాసము

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు
శుక్లనామ సం॥ శ్రావణ ౨ మ॥

(వి-వి)—

సమగ్రము సంస్కృతమూలము కూడనున్నది వ్రాఁతమంచిది. తప్పులు లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

భగవద్గీతా శాస్త్రమునకిది పద్యరూపమయిన తెలిఁగింపు. లింగమ పర్తి పురవాస్తవ్యుఁడయిన యుడతల పాపయమంత్రి ప్రేరణముచే మికిలి మల్లికార్జున కవి యీ గ్రంథము రచించి, యీ పాపయ మంత్రిచే లింగమపర్తి పురముననే ప్రతిష్ఠితుఁడయిన శ్రీరామ దేవునకు సమర్పించెను ఈకవి యీ కృతిప్రేరకుని ప్రేరణముచేతనే యింతకుముందు రామచంద్రోపాఖ్యానమను ప్రబంధమును రచించెను మఱియు నీకృతి ప్రేరకుఁడు, భమిడిపల్లి వేంకటకవి రచించిన శేషధర్మములు అను తెనుఁగు కృతినిగూడ లింగమపర్తి పురమున ప్రతిష్ఠితుఁడయిన రామదేవునకే యర్పింపించెనట విశేషములకు దావ్యాంత పద్యములఁ గాంచునది మఱియు రామచంద్రోపాఖ్యానము ఆర్. నె 63 రున చూచునది

---

## R No 776

Palm leaf Size, 17¼ × 1½ inches Foll 67 Lines, 6 on a page Mode of writing, good and fairly free from mistakes Injured

Presented in the year 1927–28 by the Maharajah of Pithapuram

భగవద్గీతాశాస్త్రము

BHAGAVADGITĀŚĀSTRAMU

A rendering into Telugu poetry by Konduri Jaggarayakavi of the Sanskrit Bhagavadgita

This work is dedicated to God Nrsimhaswami worshipped at Mangaladri The author was a Ksatriya by caste and belonged to Dhananjayagōtra

Complete

**Beginning**

. . . ను
ద్భవమయ్యెఁగొండూరి తల్లధీరుఁ
డతఁడువరించె రామాంబ చందాంబల
నిద్దఱబుద్ధరాజేంద్రసుతల
నందురా . .

. . . . . .

నలువురకు నగ్రజాతుఁడై వెలసె రామ
భద్రుఁడైవడిబుద్ధభూపాల మౌళి

ఉ. శ్రీరుచి <u>మంగళాద్రినర</u>

•

మారవికారదూర బుధమాన్యుఁడ <u>జగ్గయనామధేయుఁడన్</u>.

ఉ పంచమవేదమైకల ప్రపంచము కల్మషగర్వమంతయున్

* * * *

<u>తిమ్మఘనున్</u> మదిలోఁదలంచెదన్.

ఉ పాయకలోకమందునను భాగవతంబును భారతంబు రా
మాయణ

* * * *

లక్షణధుర్యుల నాత్మఁదల్చెదన్

* * * *

నరసఖునికి <u>మంగళాద్రి</u> నరకేసరికిన్

వ-సభక్తి సమర్పితంబుగా నాయొనర్పఁబూనిన శ్రీభగవద్గీతామ —

**End**

శా ఏ యోగేశ్వరుఁడైన కృష్ణుఁడు గిరీటీయొద్దనే దిక్కులన్
శ్రేయోవృత్తి ధనుర్ధరాధిపతులై సిద్ధంబుగా నున్నయ
ట్టాయాదిక్కులనుండువారికి జయంబౌనీతియౌ సంపదౌ
శ్రీయౌనొప్పిద మాధ్రువంబనికడున్ బ్రీతిన్ముదం బొందితిన్.

వ - అని యివ్విధంబునఁ గృష్ణార్జున సంవాద విధానంబు సంజయుండు ధృతరాష్ట్రునకు తెలుంగించెనని జనమేజయునకు వైశంపాయనుం డర్జున విషాదయోగంబు సాంఖ్యయోగంబును కర్మయోగంబును జ్ఞానయోగంబును సన్న్యాసయోగంబును విజ్ఞానయోగంబును పరబ్రహ్మయోగంబును గుహ్యరాజయోగంబును విభూతియోగంబును విశ్వరూపదర్శనయోగంబును భక్తియోగంబును ప్రకృతి పురుషవిభాగయోగంబును గుణత్రయయోగంబును సంసారవృక్షచ్ఛేదకురారయోగంబును పురుషోత్తమ యోగంబును దేవాసురసంపద్వివేకయోగంబును శ్రద్ధాత్రయవిభాగయోగంబును సకల లోకోపనిషదర్థప్రతిపాదయోగంబును సవిస్తారంబుగా వినిపంచిన విని అత్యంత హర్షాంతరంగుఁడగుచు సమస్త భవబంధంబులుం బాసియుండె

సీ. ఏభూములందుల నీగీతలుండు నా
వసుధలో నెల మూఁడు వర్షములును
పరగంగఁగురియును బాడిచేఁబంటచేఁ
బ్రజలుండు రధిక సంపదలతోడ

సత్యుగ్రరోగా పమృత్యువుల్ నాశమౌ
జారచోరుల పేరు దూరమగును
ధర్మంబు నాల్గుపాదములతో నడచును
వర్ణాశ్రమంబుల వరుసదప్పు
నానర నెవ్వని గృహమునను౦డెనేని
వానిగృహంమున నిందిరావల్లభుండు
పరగలక్ష్మిసమేతుఁడై పాయకుండి
భోగమోక్షంబు లిచ్చు నద్భుతముగాఁగ

క ధరలోన గీతలెవ్వరు
పరగంగావినిన వ్రాయఁబరియించినయా
నరునకు సుస్థిరతరముగ
మురహరుఁడొగినిచ్చు భోగమోక్షసుఖంబుల్.

ఉ. అక్షయమోక్షదంబును మహాదురితక్షయకారణంబు ప్ర
త్యక్షరమున్ రమాధవునుదారకథాచరితంబు తత్కథల్
దక్షతనెవ్వరేఁ జదివినన్ మతి వ్రాసిన విన్నధాత్రిఁబ్ర
త్యక్షమువారికిం గరతలామలకంబులు భోగమోక్షముల్

శా స్వామీ దేవర ప్రేరణంబునను వ్యాసప్రోక్తమై భోగల
క్ష్మీమోక్షప్రదమైన యట్టి భగవద్గీతా మహాశాస్త్రమున్
నేమంబొప్పఁ దెనుంగుఁ జేసితిఁదగన్ నేనేర్చినట్లంచిత
శ్రీమించంగఁ బరిగ్రహింపుముదయన్ శ్రీ మంగళాద్రీశ్వరా.

* * * *

పంచచామరం

సనందనాదియోగి చిత్తసారసారసారుణా
వనోద్భవాక్షరూక్ష దుఃఖవారవారవారణా
వనప్రభావ భవ్యభక్తి వాసవాసవాసనా
ననౌఘ వారపావకాఖ్య నందనందనాచ్యుతా.

**Colophon**

ఇది శ్రీమద్గురుదయావిశేషలబ్ధసారస్వతపవిత్ర ధనంజయ గోత్ర కొండూరి తల్లభూపాల తనూజ జగ్గరాజ ప్రణీతంబైన శ్రీమహాభారతంబునందు భీష్మపర్వంబునంగల భగవద్గీతా శాస్త్రంబున శ్రీకృష్ణార్జున

సంవాదంబునందు సకలోపనిషదర్థ ప్రతిపాదకయోగంబున్నది అష్టాదశాధ్యాయము

(వి-వి)—

సమగ్రము వ్రాతమంచిది తప్పులంతగా లేవు శైథిల్యము మిక్కిలి హెచ్చు. గ్రంథపాతములు అమితముగాఁ గలవు పురుగు తినుటచే పుస్తకము చాలఁ జెడినది.

భగవద్గీతా శాస్త్రమునకిది తెలిఁగింపు రచయిత కొండూరి ఇగ్గరాజ కవి గ్రంథశైథిల్యపాతములవలన గ్రంథకర్త వంశవృత్తాంతము సరిగా గుర్తింపఁబడుట లేదు కవిక్షత్రియుఁడు ధనంజయ గోత్రుఁడు. కృతిపతి మంగళాద్రి నృసింహస్వామి

---

## R No 777

Palm-leaf 18¾ × 1½ inches Foll 150 Lines, 7 on a page Mode of writing, good and fairly free from mistakes Slightly injured

Presented in the year 1927–28 by the Maharajah of Pithapuram

రంగనాథరామాయణము.

RANGANĀTHARĀMĀYANAMU

Same work as that described under No 981 of the Descriptive Catalogue of Telugu MSS

Complete

(వి-వి)—

సమగ్రము వ్రాత చక్కనిది తప్పులంతగా లేవు శైథిల్యము గ్రంథపాతములు ఆరంభమున రెండు పత్రములందు గలవు ఈ ప్రతి ప్రాచీనము పాఠశుద్ధిగలదిగాఁ గానవచ్చుచున్నది.

ఇది డి. కె 981 లోన వర్ణితమైనదే

---

## R No 778

Palm-leaf 16 × 1⅜ inches Foll 140 Lines, 7 on a page Mode of writing, good but not free from mistakes Injured

Presented in the year 1927–28 by the Maharajah of Pithapuram

మహాభారతము.

MAHĀBHĀRATAMU

Same work as that described under No 163 of the Descriptive Catalogue of Telugu MSS Vol I

Contains Udyōgaparva complete and a portion in Striparva

(వి-వి)—

అసమగ్రము ఉద్యోగపర్వము పూర్తిగను, స్త్రీ పర్వము అసం పూర్తిగను నున్నవి వ్రాంత మంచిది. తప్పులు గలవు శైథిల్యము గ్రంథపాతములు కలవు

ఇది డి నె 163 రున వర్ణితమైనదే.

---

## R No 779.

Palm-leaf Size, 15¾ × 1¼ inches Foll 100 Lines, 7 on a page Mode of writing, good and fairly free from mistakes Injured

Presented in the year 1927–28 by the Maharajah of Pithapuram

మహాభారతము

### MAHĀBHĀRATAMU

Same work as that described under R No 163 ante
Contains the Bhīsmaparva only

(వి-వి.)—

అసమగ్రము భీష్మపర్వము మాత్రమున్నది. వ్రాంత చక్కనిది తప్పులంతగా లేవు శైథిల్యము గ్రంథపాతములు గలవు

ఇది ఆర్ నె 163 రున వర్ణితమైనదే

గ్రంథాంతమందీ వ్రాంతగలదు —

"నలనామ సం॥ శ్రావణ బ॥ ౧౪ బుధవారం వరకు బుద్ధరాజు వెంకట్రాజుగారు వ్రాసిన ప్రతినున్న క్రమానబోనేపల్లి వెంకట్రాజు గారు వ్రాసిన ప్రతినున్న క్రమానను శ్రీపాద లక్ష్మీపతి తమ తాత కొల్లూరి జోగన్నగారి శిక్షను వ్రాసెను"

---

## R No. 780

Palm-leaf Size, 18 × 1½ inches Foll 15 Lines, 6 on a page Mode of writing, good but full of mistakes Injured

Presented in the year 1927–28 by the Maharajah of Pithapuram

కపోతవాక్యము.

### KAPŌTAVĀKYAMU

Same work as that described under R No 141-*b* ante
Incomplete

(వి-వి)—

సమగ్రము. వ్రాఁత చిన్నదిదేకాని తప్పులు హెచ్చు శైథిల్యము కలదు గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్ నె 141-*b* రున వర్ణితమైనదే

---

## R No 781

Palm-leaf Size, 15⅝ × 1½ inches Foll 96 Lines, 7 on a page Mode of writing, good but not quite free from mistakes Injured

Presented in the year 1927–28 by the Maharajah of Pithapuram

మహాభారతము

### MAHĀBHĀRATAMU

Same work as that described under No 163 of the Descriptive Catalogue of Telugu MSS Vol I

Contains the Śalya and Sauptika parvas

(వి-వి)—

అసమగ్రము శల్యసౌప్తికపర్వములు సమగ్రముగా గలవు వ్రాఁత మంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము హెచ్చుగాఁ గలదు గ్రంథపాతములు గలవు

ఇది డి. నె 163 రున వర్ణితమైనదే.

గ్రంథాంతమందీవ్రాఁత గలదు —

" సౌమ్యకనామ సంవత్సర జ్యేష్ఠశు॥ ౧౪ శనివారం రాత్రివరకు యీ సంపుటాన్ని శల్యపర్వమున్నూ సౌప్తిక పర్వమున్నూ మూలపతి నున్న క్రమంగాను కూరాడ నారాయణ మహాత్తి స్వహస్తంగాను వ్రాసెను. "

---

## R No 782.

Palm-leaf Size, 16 × 1¼ inches Foll 210 Lines, 6 on a page Mode of writing, good but not free from mistakes Much injured,

Presented in the year 1927–28 by the Maharajah of Pithapuram

మహాభారతము.

### MAHĀBHĀRATAMU

Same work as that described under No 163 of the Descriptive Catalogue of Telugu MSS

Incomplete

(వి-వి)—

అసమగ్రము. సౌప్తికోద్యోగపర్వములు సమగ్రముగను భీష్మ పర్వము అసమగ్రముగను గలవు వ్రాంతమంచిది తప్పులున్నవి శైథిల్యము హెచ్చు గ్రంథపాతములు గలవు

ఇది డి కై 163 రున వర్ణితమైనది

---

## R No 783

Palm-leaf Size, 15¾ × 1⅜ inches Foll 212 Lines, 7 on a page Mode of writing, fair but not free from mistakes Injured

Presented in the year 1927–28 by the Maharajah of Pithapuram

మహాభారతము

### MAHĀBHĀRATAMU

Same work as that described under No 163 of the Descriptive Catalogue of Telugu MSS

Contains the Ādiparva complete and a Portion in the Sabhaparva

(వి-వి)—

అసమగ్రము. ఆదిపర్వము సమగ్రముగను, సభాపర్వమున భాగ మును గలవు. వ్రాంత చక్కనిది తప్పులున్నవి శైథిల్యము గ్రంథపాతములు గలవు

ఇది డి కై 163 రున వర్ణితమైనదే

---

## R No 784

Palm-leaf, 15 × 1 inches Foll 217 Lines 6, on a page Mode of writing, not good and not free from mistakes Much injured

Presented in the year 1927–28 by the Maharajah of Pithāpuram

ద్విపద దశమస్కంధము.

### DVIPADA DAŚAMASKANDHAMU

Foll 1 *a*–138 *a* Foll 138 *b* and 139 are left blank A Dvipada work describing the story of the Tenth Skandha 1st part, of Srimad-bhāgavata, By Ratnakarnamu Gōpālakavi

**Beginning**

శ్రీ కమలాధ్యక్షుు శ్రితకమలాక్షు
లోకనాయకు దైత్యలోక సంహరు
నాగేంద్రతల్పుకు నాగేంద్రవరదు
నాగారివాహను నాగారి మధ్య

* * * *

మహితకాంచనచేలు మదవతీలోలు
మహనీయగుణజాలు మదనగోపాలు
గరిమతో వినుతించి

*  *  *  *

ప్రాకటంబుగనెంచి భవ్య సత్కీర్తి
శ్రీ కరమూర్తి దేశికచక్రవర్తి
భట్టరు శ్రీ చెన్నభట్టారుఁబోగడి
గట్టిగానాదిమకవులఁగీర్తించి
దిట్టఁడైకుకవుల దీమసంబెంచి
రత్నాకరాన్వయ రాజతటీర
రత్నాకర సుధాకరత్వభాసితుఁడు
రాజిల్లు కృష్ణమరాజ నందనుఁడు
రాజితసకలకళావిచక్షణుఁడు
గోపాలసత్కవికుంజరుండనఁగ
నేప్రొద్దు మహిలోన నింపొందువాఁడ
మన్నీలు రాజులు మాటిమాటికి
సన్నుతిసేయంగ సత్కవుల్ మెచ్చ
పావనంబగు పూర్వభాగంబు ద్విపద
గావింతుఁదత్కథాక్రమమెట్టిదనిన
కలధౌతనవహేమకలితవిశాల
నళినారిమండలోన్నత సౌధచయము
తారాపథోన్నత తపనీయతార
సారభాసుర రత్నసౌధ జాలములు
కమలానివాససత్కళ్యాణవిభవ
రమణీయమందిరారామభూములును
అరుదైన వేదశాస్త్రాది విద్యలను
పరమేష్ఠి మెచ్చని బ్రాహ్మణోత్తములు
మంత్రతంత్రోపాయ మహామలదేవ
మంత్రిని మెచ్చని మంత్రి పుంగవులు

*  *  *  *

మహిమలవిలసిల్లు మథురాపురంబు

**End**

పౌరులు బంధులాప్తజనంబు లెల్ల
శౌరి రుక్మిణులకు త్సాహంబుతోడ
గురుభూషణములు దుకూలచేలములు
కరమర్థి రత్నముల్ కానుకలిచ్చి
రావేళయదుకులాధ్యక్షుఁడువారి
భావించితగు రీతిబహు తృప్తిఁజేసి
తనయుంత రుక్మిణీ తామరసాక్షి
నెనసికృష్ణుఁడు సుఖియించినటించె

* * * *

జనమనోరంజనాంచద్వేణునాళ
నినదామృతాస్వాదనియ గోపాల
భావనాకుచకుంభ పరిరంభశుంభ
దావిద్ధ రాసకేళ్యాసక్తు పేర
వసుదేవదేవక్యవనభాకచక్య
రసికుని పేర నిర్జరలోకపారి
జాతాపహుని పేర జాతరూపాతి
పీతాంబరావలంబితకటీఘటిత
కరకింకిణీకాంచికాకాంతిపుంజ
హారిదంతరుని పేర హరిహయాంభోజ
భవభవస్తుతగుణాభరణుని పేర

* * * *

వహిఁగన్న శ్రీ భాగవత పురాణమున
మహిమగాంచిన దశమస్కంధమందు
పూర్వభాగాశేషపుణ్య సత్కథలు
పూర్వకావ్య కవిత్వ పుణ్యులొనరఁగ

గ్రంథాంతమందీ క్రింది వ్రాఁతగలదు —

"పార్థివనామ సంవత్సర ఆషాఢశు ౧౦ వరకు రా॥ హాకీం నారాయణం మాదన్న కౌమారుడు బాల యీరంణ వ్రాసుకున్న భాగవతం దశమస్కంధం ద్విపద సమాప్తం జ్యేష్ఠశు ౧౦ మొదలు కొని ఆషాఢశు ౧౦ వరకు ముగిసెను"

(వి-వి)—

సమగ్రము తుదిని కవికూర్చి ఉండవలసిన ద్విపదలుకొన్ని కొఱఁత వ్రాతమంచిదికాదు తప్పులున్నవి శైథిల్యము గ్రంథపాతములు హెచ్చుగాఁగలవు

శ్రీ మద్భాగవత దశమస్కంధ పూర్వభాగమునకిది ద్విపదరచనము గ్రంథకర్త రత్నాకరము గోపాలకవి. ఇతని గ్రంథాంతరము సౌగంధికాపహరణము ఆర్ నె 173 (c) రున వర్ణితమైనది

నలచరిత్ర

NALACARITRA

Foll 140 (*a*) 217a

Same work as that described under R No 145 *ante*

(వి-వి.)—

సమగ్రము వ్రాఁతమంచిదికాదు తప్పులున్నవి శైథిల్యము గ్రంథపాతములు గలవు

ఇది ఆర్ నె 145 రున వర్ణితమైనదే.

---

R No 785

Palm leaf Size, 16×1½ inches Foll 82 Lines, 7 on a page Mode of writing, good but not free from mistakes Injured

Presented in the year 1927–28 by the Maharajah of Pithapuram

(a) ఆనందరంగరాట్ఛందము

ĀNANDARANGARĀTCHANDAMU

Foll 1 (a) to 78 (a) Fol 78 (*b*) are left blank Same work as those described under R Nos 159 and 533 ante

Complete

(వి-వి.)—

సమగ్రము. కృత్యవతరణిక లేదు. ఎలుకకొఱుకులవల్ల శైథిల్యము గ్రంథపాతములు ఏర్పడెను వ్రాఁత తిన్ననిది తప్పులున్నవి.

ఇది ఆర్ నె 159, 533 రుల వర్ణితమైనవి.

(b) ఆంధ్ర భాషా రత్నాకరము.

ĀNDHRABHĀSĀRATNĀKARAMU

Foll 79 (*a*)—82 (*b*)

Same work as that described under R No 339 b ante

Incomplete

(వి-వి)—

అసమగ్రము ఆదినుండి మూడవ యాశ్వాసమునం గొంతదాకం గలదు వ్రాంత తిన్ననిది తప్పులున్నవి శైథిల్యము గ్రంథపాతములు గలవు.

ఇది ఆర్ నె 339 (b) లోన వర్ణితము

---

R No **786**

Palm leaf Size, 15½×1 inches Foll 22 Lines, 5 on a page Mode of writing, bad and full of mistakes Injured

Presented in the year 1927–28 by the Maharajah of Pithapuram

బేతాళ పంచవింశతి.

BETĀLAPANCAVIMŚATI

Foll 123 a 1 Fol 23 b left blank This is a Telugu summary of the Betālapancavimsati found in Kathasaritsāgara in Sanskrit The name of the author is not known

Wants the beginning and the end, otherwise complete

**Beginning**

గీ విక్రమార్క భూమివిభుండు బేతాళునిం
గట్టి తెచ్చునపుడు కథలు చెప్ప
వినుచు నతని నెట్టి విధమున గొని తెచ్చె
నానతిమ్ము వల్లకీవినోద !

వ అని యడిగిన బలిదానవేంద్రునకు నారదమునీంద్రుం డిట్లని యె ;

సీ. విక్రమార్కుండు జగద్విఖ్యాత సత్కీర్తి
జగము పాలించునా సమయమునను
శాంతిశీలుండను సంయమి నిత్యంబు
నొక పండు నృపతికి నుపద యియ్య
నంతట నొకనాండమ్ముని యిచ్చిన
ఫలము వానరుమీ (ద ?) పడగవేయ
నది మర్కటము విప్పనందు లోకనాకమణి
గనుపట్టుటయు ధరాకాంతుండాత్మ

నద్భుతం బాదినును జెప్పినవియషాశ
నట్లనైయున్న నతని కిట్లనియె నృపతి
యేమి యర్థించి తెచ్చితి విట్టి మణుల
చెప్పు మనుటయు నిట్లని చెప్పఁదొడఁగె

గీ. వచ్చు కృష్ణచతుర్దశీ వాసరమున
నర్ధరాత్రంబు నాకడ కరుగుదెంచి
పితృవనమ్మున నేఁజేయు క్రతువు కీవు
సాధకుండవు గమ్ము భూజనవరేణ్య!

**End**

గీ పగల కీడుదలఁచు పాపాత్ముఁడెంతైన
శుభముఁ బొందఁగలఁడె సుకృతుఁగాక
ధర్మమే జయమ్ము ధర్మమే జయమను
వాక్యమేల తప్పు వసుధలోన.

గీ కపటశీలుఁడయిన క్షాంతి శీలునిఁజంపి
దోష మహితుదర్గిఁ దృప్తిఁచేసి
వరముఁబొంది శాపవర్జితు బేతాళుఁ
గొనుచు నుజ్జయినికిఁ జనియె నవుడు.

(వి-వి.)—

సమగ్రము కాని అవతరణికగాని, అవసానముగాని లేవు వ్రాఁత మంచిదిగాదు. తప్పులు హెచ్చు శైథిల్యము గ్రంథపాతములు గలవు

సంస్కృత కథాసరిత్సాగరమునఁగల బేతాళ పంచవింశతి కథల కిది మిక్కిలి సంగ్రహరూపమయిన తెలుఁగు. కర్త పేరెఱుఁగరాదు. ఆర్. నె 594 రున వర్ణితమైన రచనము వేఱు. ఇది వేఱు ఆ రచనము దీనికంటె మిక్కిలి మేలయినది.

(b) కూడేరు సంగమేశ్వరదండకము.

KŪDERUSANGAMEŚVARADANDAKAMU

Foll 24*a*—28*b*

The various incidents that take place at the time of the car festival of God Sangamēsvara worshipped at Kūdēru, are described in this work in a humorous way The name of the author is not known.

**Beginning**

శ్రీమద్గిరీంద్రాత్మజావృత్త వచోజయుగ్మాంచితస్నిగ్ధకాశ్మీరము ద్రాలసద్వ్యక్తబద్ధానురాగస్ఫురత్పీనవక్షస్థలుం డంబికా శుభ్రరోచిర్దివౌకోనదీవానుకీవ్యాళ ఖట్వాంగపాలాహలాగ్ని త్రిశూలోరు సారంగచర్మేణభూతిప్రదోద్యత్పినాకాద్యభూత్యుద్యదస్తోక భారానమత్పత్రపర్ణ ప్రభాజాల భాస్వత్ప్రతీకుండు

**End**

సురాపాన విభ్రాంతులై యొడ్డెలున్ బొద్దుగాఁ జొక్కుచున్ నిక్కుచున్ బెక్కులన్ ద్రేలఁగా రంఘురంఘా(?) వుపోష్యముండావు

(వి-వి.)—

అసమగ్రము వ్రాఁతమంచిదిగాదు తప్పులు హెచ్చు శైథిల్యము గ్రంథపాతములు చాలఁగలవు

కూడేరు అను గ్రామమున వెలసిన సంగమేశ్వరస్వామివారి తిరునాళ్ల విశేషములు హాస్యప్రధానముగా దండకరూపమున వర్ణితము లయినవి కర్త పేరెఱుఁగరాదు

---

## R No 787

Palm leaf Size, 15 × 1½ inches Foll 19 Lines, 8 on a page Mode of writing, good but not free from mistakes Much injured

Presented in the year 1927–28 by the Maharajah of Pithapuram

ముముక్షుజనకల్పకము.

### MUMUKSUJANAKALPAKAMU

Same work as that described under R No 217 ante

Incomplete

(వి-వి)—

అసమగ్రము కడపటిదగు నేకాదశప్రకరణము మాత్రమున్నది వ్రాఁతమంచిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు కడు హెచ్చు

ఇది ఆర్ నె 217 లున వర్ణితమైనది

---

## R No 788

Palm leaf Size, 17 × 1½ inches Foll 221 Lines, 8 on a page Mode of writing, good but not free from mistakes Much injured

Presented in the year 1927–28 by the Maharajah of Pithapuram

మహాభారతము

MAHĀBHĀRATAMU

Same work as that described under No 219 of the Descriptive Catalogue

Incomplete

(వి-వి.)—

ఆసమగ్రము ఆనుశాసనిక విరాటపర్వములు మాత్రము గలవు. వ్రాంతమంచిది తప్పులున్నవి శైథిల్యము గ్రంథపాతములు హెచ్చు

ఇది డి సె 219 రున వర్ణితమైనదే

---

R No 789

Palm-leaf Size, 18 × 1½ inches Foll 104 Lines, 7 on a page Mode of writing, good but not free from mistakes Injured

Presented in the year 1927–28 by the Maharajah of Pithapuram

బ్రహ్మవిద్యాసుధార్ణవము

BRAHMAVIDYĀSUDHĀRNAVAMU

Paramanandayati, disciple of Dattātrēya, has choren certain passages bearing on Advaita Vēdānta, from Srutis, Smrtis and Itihāsas and has herein interpreted them according to his personal experiences The work contains 13 chapters

Complete

**Beginning**

శ్రీమత్పరమానందగురవే నమః.

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలంజ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వ మస్యాది లక్ష్యమ్,
ఏకం నిత్యం విమలమచలం సర్వ ధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం నమామి.

శ్లో॥. జగదంకురకందాయ। సచ్చిదానంద మూర్తయే
గళితాఖిల భేదాయ నమశ్శాంతాయ తేజసే.

శ్లో॥. నమః పరమ శాంతాయ। సచ్చిదానందమూర్తయే।
శ్రీదత్తాత్రేయ యోగీంద్రచంద్రాయ పరమాత్మనే

శ్లో॥ శ్రీమూర్తిర్యస్యదత్త ప్రతిపదయుగళీ చింతనా ప్రాప్తనోత్తే
ర్వేణీబంధేన మింధే వికచవిచికిలామోద మాపాదయస్తి।
నిత్యానందానుసంధాజనితసుఖరసాస్వాద సామోదచేతా
యోగీంద్రాణాం వినేతాసజయతి పరమానంద తీర్థవ్రతీంద్రః

శ్లో॥ తత్త్వం పదవివేకోక్తిం పరమానందదేశికః।
కురుతే బాలబోధాయ యథా వేదాంతపద్ధతిః

శ్రీమద్దత్తాత్రేయగురుచరణసరోజమత్తమధుకరాయమానులైవిమల తత్త్వార్థ రహస్యవేత్తలైన పరమానందతీర్థులు సమస్త లోకోపకారార్థంగానున్ను వేదాంత రహస్య గ్రంథము రచియింప నిశ్చయించి 'యావదాయుస్త్రియోవర్ణావసరం కించితాకామాది నామనాగపి' అనెడి శాస్త్రాలు గలుగబట్టిన్ని ప్రాకృతముముక్షువులయొక్క సంశయనివృత్తి కొఱకున్ను సకల వేదాంతసిద్ధాంత స్మృతీతిహాస పురాణాగమాది తత్త్వశాస్త్రాలచేతనున్ను లౌకికోక్తులచేతనున్ను శ్రీ మద్దత్తాత్రేయ గురుకృపాలబ్ధస్వానుభవంవల్లనున్ను పరమానందమగ్నచిత్తుండనై ఒక అనుభవగ్రంథం రచియింప నిశ్చయింస్తిని అయితే అనుభవం వాక్కునను చర్చించ శక్యమానా అంటే, శక్యమేకాదు. సత్యం, అయినాగాని చెఱువునిండి పూర్ణమైతే అలుగుపాఱినట్లు నాయందు నిండిన సచ్చిదానందమేబహిఃప్రసారియై లోకులకు ఉపకరింస్తున్నది. అలుగులనున్ను మడుగులనున్ను పారిన ఉదకాలు సమస్తమైన సస్యాదులకున్ను ఉపకరించినట్లె ఉపకరింస్తున్నది

**End**

అశరీరం యదాజ్ఞానంపశ్యతి జ్ఞానచక్షుషా । తదాభవతి శాంతాత్మాసర్వతో విగతస్పృహః । అని కల్గు గనుక నిరాశుండైన యోగి దేహప్రారబ్ధానంగూర్చి తన మనస్సు యేయే విషయమందు ప్రవర్తించేని అక్కడ నల్లా బ్రహ్మాకారంగానే చూచును దేహాభిమానేగళితే విజ్ఞాతే పరమాత్మని యత్రయత్ర మనోయాతి తత్రతత్ర సమాధయః అని కలదు ఈ ప్రకారాన సర్వమంగళహేతువైన జీవన్ముక్తిగల యోగినెవ్వరు ఆచరించేరు. ఎవ్వరు పూజించేరు వారే కృతార్థులు ఈ ప్రకారాన స్వరూపప్రమాణసాధనాలచేత జీవన్ముక్తి నిరూపింపబడెను అజడోహమక్షరోహం ప్రాజ్ఞోహం ప్రత్యగాత్మబోధోహమ్ । పరమానందమయోహం పరమశివోహం భవామిపరిపూర్ణః ।

* * * *

శ్లో పరమానంద యతీంద్రో
న్స్వాన్తైర్వృష్టా త్రియోదశప్రకరణకా ।
అరవితారక మేషా
టీకా భువిచిత్ప్రికాశికా జయతు

శ్లో పరమానందతీర్థీయ బ్రహ్మవిద్యాసుధార్ణవాత్
ఆనందామృతసంతృప్తా మహాంతస్సంతుసంతతమ్.

**Colophon**

ఇది శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్యపరమానందతీర్థయతి కృతౌ బ్రహ్మవిద్యాసుధార్ణవే. యోగశాస్త్రే జీవన్ముక్తౌ పంచప్రయోజననిరూపణంనామ త్రయోదశప్రకరణం సమాప్తమ్

(వి-వి)—

సమగ్రము వ్రాంతమాఁచిది తప్పులున్నవి శైథిల్యము గ్రంథపాతములు గలవు

దత్తాత్రేయగురుశిష్యులగు పరమానందయతీంద్రులు, అద్వైతవేదాంతపరమైయిన శ్రుతిస్మృతిఇతిహాసాదులలోనిసూక్తులను సేకరించి స్వానుభవానుగుణముగా బ్రహ్మవిద్యాసుధార్ణవమను పేర పదుమూడు ప్రకరణములుగల యీ యాంధ్రవచనవేదాంతగ్రంథము సూచించిరి. ప్రకరణాద్యంతములందు సంస్కృత శ్లోకములు గలవు.

---

## R No 790

Palm-leaf Size, 16 × 1¼ inches Foll 26 Lines, 7 on a page Mode of writing, good but not free from mistakes Injured

Presented in the year 1927–28 by the Maharajah of Pithapuram

(a) జన్నవాడజనార్దన శతకము

JANNAVĀDAJANĀRDANAŚATAKAMU

Foll 1*a*–10*a* Fol 10*b* is left blank

Written in praise of God Janārdana worshipped at Jannavāda in Nellore District The name of the author is not known

Incomplete

**Beginning :**

సీ. శ్రీతరుణీశ రాజీవాయతాక్షరా
కాచంద్రదళింబాను కారివదన

మందస్మితామృతమహితగంభీరభా
షణ కంబుకంఠ విశాలవక్ష !
శంఖచక్రగదాబ్జచారు కరాంభోజ
కౌస్తుభాలంకృత కనకవసన
పంకజనాభ దిక్పాలపూజితపాద
వేదాంతసంవేద్య విశ్వరూప

శతకమొకటి సమర్పింతుసామి నీకు
మేలుగాఁజిత్తగించి నన్నేలుకొనుము
జన్నవాడపురీశ జగన్నివేశ
వరజనార్దనదేవ ! దివ్యప్రభావ !

సీ జయజయవిజయీభవ యనుచునుతియించి
నీచెంగటనిలిచి నీపదార
విందంబులు హృదయమందు నిలుపుకొని
నీమోముజాబిల్లిని బలుమారు
కన్నులపండువుగాఁజూచుచు భువన
మోహనమైన నీదేహపటిమ
భావించుచుముదముతో విమలంబైన
నీకీర్తిమిగుల వర్ణింపుచున్న

నన్నురక్షింపకిట్లు కన్నడవహింప
నాయమానీకు లక్ష్మీసనాథనాథ
జన్నవాడపురీశ జగన్నివేశ
వరజనార్దనదేవ ! దివ్యప్రభావ !

**End**

సీ జయజయదేవతాసార్వభౌమ జయజ
యపురాణపురుష జయజయవైరి
వారణకంఠీరవ బిరుదజయజయ
శరణాగతత్రాణచారు . .
జయజయధాత్రీశ జయజయలోకేశ
జయజయసకలశాస్త్ర-కీర్తి
సంపన్న జయజయశత్రువధూ
గర్భనిర్భేదన నిర్భరార్భ

